# అయిదుహత్యలా?

(అపరాధపరిశోధక నవల)

మద్దూరి శ్రీరామమూర్తికవి

విరచితము.



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు,

శ్రీసత్యనారాయణబుక్ డిపో, రాజమండ్రి.

 [వెల రు. 1-0-0

# పీఠిక.

---

ఇయ్యది యొక రహస్యాపరాధపరిశోధకాఖ్యాయిక. మోహపిశాచావేశు లగువారలు యుక్తాయుక్తముల గణింపక తమమార్గమున కడ్డువచ్చినవారి నెల్ల నేదోయొకవిధమున నదలించుకొన ప్రయత్నింతురు. ఇందు లీలాకుమారిని మోహించిన గంగారాముడు హంతకుడై కథానకమునకు సూత్రధారుడై యుండెను. బహుళజనాకీర్ణ మగు కలకత్తానగరమున నెట్టి యాధారములును లభింపకున్నను దోషియగు లీలాకుమారి నన్వేషించుటయందు గిరిధరలాలు చేసినయత్నము లత్యద్భుతములు. ఒకసారి గ్రంథము చదివినయెడల పాఠకలోకమునకు గిరిధరుని బుద్ధిచాతుర్యము గోచరింపకమానదు.

ఇట్లు,

మద్దూరి శ్రీరామమూర్తి,

గ్రంథకర్త.

# విషయ సూచిక



# ఉపక్రమణిక.

---

చతురంభోధి పరీతమగు నీభూవలయమున కాంతాకనకములపై నాసక్తిలేనివాఁడు లేఁడనుట సర్వజనవిదితము. ఎంతమునుపలికైనను చక్కని యువతీరత్నము కంటబడిన యెడల నపేక్షజనించుననుటయం దావంతయు నసత్యములేదు కావుననే "బలవానింద్రియగ్రామో విద్వాంస మపికర్షతి" యను నార్యోక్తిజనించినది. లోకమున జితేంద్రియులుండుట యరుదు. అందునను నీకలియుగంబున "కన్నుదోయికి నన్యకాంత లక్ష్మింబైన మాతృభావముజూపి మరలువాఁడుండఁబోఁడని చెప్పవచ్చును.

ద్రవ్యమునెడ నధికమగు వ్యామోహమునుజెంది "ధనమూలమిదంజగత్"ని వర్తించుచు 'బట్టకు పొట్టకు బెట్టిన సొమ్మునకు వృద్ధియెట్లువచ్చు"నని దలంచుచు—మానాభిమానముల మాటమరచి యుచ్చనీచతలు గణింపక — ధనార్జనమునను, ధనసంరక్షణమునను జీవయాత్ర గడపునంతటి లోభులు ప్రపంచమున నెక్కడనో కోటికొక రిద్దరుందురుగాని, కాంతావ్యామోహమధికముగా గల్గువారు వేనవేలుగగాన్పింతురు. కాంతావ్యామోహమున బడినవారు యుక్తాయుక్తవిచారశూన్యులనుటకు, "కామాతురాణాంనభయంన లజ్జా."

యును వచనము తార్కాణముగనవచ్చును. మోహపిశాచమావహించినవాఁడు తానితరులచే జెడుమార్గమున సంచరించుచున్నాఁడవని ప్రబోధింపఁబడినను గుర్తింపక— 'తానలచినదే రంభ, తాముఁగినదే గంగ' యని తలంచుచు దినదినంబునకు మోహంబు రెట్టింప నట్టి మోహపిశాచమును గాఢాలింగన మొనరించుచుండును.

మోహాసక్తుఁ డెట్టి నీచంపుబనికైనను, ఘోరరాక్షస కృత్యమైనను జేయుట కెట్టిసంకోచమును బొందఁడు. ముల్లోకాధినాథుండగు దేవేంద్రుఁడంతటివాఁడు గౌతముని వంచింప నర్ధరాత్రమున కుక్కుటమువోలె కూసెను. శంభునంతటివాఁడు మోహినీదేవికై పరుగిడి యామెనుబట్ట నూహింపలేదా? సుందోపసుందులిరువురు తిలోత్తమకై యొకరినొకరు సంహరించుకొని మరణించిరి. పూర్వగాథ లటులనేల — నేఁడీకలియుగంబున నొక్కొక్క కాంతామణికై యనేకములగు యుద్ధములు జరిగినవి. క్లియోపాట్రాయను జగదేకసుందరి సీజరువంతటి వానిని మోహసముద్రమున ముంచివైచెను. ట్రోజనుయుద్ధమొక కాంతామణినిమిత్తమెగదా జరిగినది. ఎక్కడిచారిత్రములనో గణించుటెందులకు; మనదేశమున కృష్ణాకుమారియను కాంతామణికై పెక్కురు రాకుమారులామెతండ్రితో జగడమాడి యతనిరాజ్యమును గైవస మొనర్చుకొనిరి. ఇట్టి పెక్కులగు నిదర్శనములను ప్రతిదేశమునుండియు నీయ

వచ్చును. కనుక నియ్యాది నైసర్గికమగునాయుగ్మ సందియు ముద
యింపవచ్చును.

వేశ్యలు పూరుషులను దమవంక కాకర్షించుకొనుట లో నతినేర్పరలు. వారొక పూరుషునియందు మోహామున్నను లేకున్నను నాతనినుండి ధనమధికముగా సంగ్రహించుకొనుటకై ప్రేమ నభినయించుటలో చతురమతులు. మఱియు వారు ధనమునకు ప్రాధాన్యమొసంగి వర్తించుచు దమ స్వాతంత్ర్యము నిలుపుకొనుటకై సర్వదా యత్నించుచుందురు. రూపాజీవు లొక దేశమున నుండిరనియు నింకొక దేశమున లేరనియు దలంచుట పొరబాటు. అన్ని దేశములందును వ్యభిచారమువలన లభించు విత్తముతో మనుగడ గల్గువా రనేకులున్నారు. పాఠకమహాశయులూ! ఇట్టివారిని మోహాంధులు గావున్నారల నజెల్లడా?

వేశ్యలు దమతో నుండవలసిన దని యెవ్వరిని ప్రార్థింపరు. కాని పూరుషులే రూపవిలాసినుల సౌందర్యమున కాసించి (నిక్క మగు సౌందర్యమునకు తగుదుగదా వేశ్యలందు) వారిని సమీపింతురు. రూపాజీవులును పురుషుడు ధనాఢ్యుడై మంచి యోగ్యుడైనచో - తన విలాసప్రకటనముచే వివిధగతుల నాతనిమెప్పించి యాతనిబుద్ధి యితరములపై బ్రసరింపకుండ జేసి యాతనికడనున్న ద్రవ్యమంతయును సంగ్రహించుకొని సాగనంపును గదా? గాని మనుగడయందువారిక

వేశ్య లుపయోగింతురనుట నమ్మదగ్గముగాదు. వేశ్యయొక్క-నిని దిరస్కరించుట రెండవయాతనియండజూచుకొనిన నిమ్మటనే జరుగుచుండును. పురుషుఁ డెప్పుడు తన్ను వేశ్య విడిచి వేరొకని నాశ్రయించునో యపుడే యాతనిమన మాందోళనము జెందును. అట్టియెడ నాతఁ డసూయావేశుఁడగుట నిశ్చ-యము. అసూయావేశులు యుక్తాయుక్తము లాలోచింపక దమమార్గము నిష్కంటకముగా నొనర్చుకొనుటకు సర్వవిధముల బ్రయత్నింతురు.

వృథాకారహరణమేల పాఠకమహాశయులారా! అటు జూడుఁడు. ఒకపురుషుఁడు మేనెల్ల నొకయుత్తరీయముచే గప్పుకొని కీనడఁచాటుననుండి పోవుచు మాటిమాటికిని దన్నెవ్వరైన జూచుచుండిరా యని వెనుదిరిగి చూచుచు బోవుచుండెను. ఆతఁ డెక్కడకు బోవుచుండెనని ప్రశ్నింతురా? ఇంకెక్కడకు; మారపిశాచమావేశించినవా డెచ్చటకు బోవును. ఆతని యాకృతియు, గమనవైఖరియు దిలకించిన మీకు విశదమగును. అది శీతకాలమగుటచే శరీరము నిండుగ నాతఁడొకనల్లనిశాలువ గప్పియుండెను. కొంచెము మెఱుపుగలసిన తెలుపు గలపంచెను ధరించియుండెను. ముప్పటికప్పియుండుటచే నాతఁ డెవ్వఁడో గుర్తించుటకు వీలుగాన్పించకున్నది. అంతఁడు కొంతదూరమునడచి గమనవేగమును తగ్గించి—

నిర్భయుని పోలి చరచర నడువసాగెను ఆతఁడు రాచబాటనువదలి ప్రక్కనున్న సందులోనికి మళ్ళి నడువసాగెను.

పాఠకమహాశయా! కొంచెము చీకటిగానున్నదని సందేహింపకుము. ఆతఁ డెక్కడకు బోవుచుండెనో కనుగొందము రమ్ము. ఆతని ప్రసక్తి మన కేల ననుచుంటివా? ప్రాపంచక పరిస్థితుల ప్రత్యక్షముగా గనుగొనుటకై యొకపరి యాతనితో బోవుదము రమ్ము. ఆపురుషుఁ డా యంధకారమున బడి యొకటి రెండు మళుపులు దిరిగి యొకగృహముయొక్క వీధికవాటమును జేరి తలుపుతట్టెను. "వచ్చుచున్నాను." అను ప్రత్యుత్తరము వినవచ్చుటచే గాబోలాతఁడు తలుపుతట్టుట మానివైచెను. తలుపు తెరువబడినతోడనే యాతఁడు లోనికేగెను. ఒకముసలి యాతనికి గాన్పించెను. ఆమెయు నాతనిరాక గనినంతనే యాలోచనాధీనురాలయ్యెను. ఎట్టకేలకామె కొలదిగ నిలువ్రదవ్వుకొనియెను. ఇంతలో నాతఁడు చగచగ శయనాగారమును సమీపించి తలుపులోనికి ద్రోసెను. తలుపులు తెరువబడియెను. లోపల నెవ్వరును గాన్పింపరైరి.

అతఁడాకింతకోపముతో — "ఎక్కడికేగినది."

"ఏమో! నాకెట్లు దెలియును. నాలుగుగంటల కెచటికో పోయియుండెను. ఇంతవఱకామె జాడయే లేదు."

"నాలుగుగంటలకే వెడలినదా?"

"అగును."

'వెళ్ళునపు డేమేని జెప్పియుండెనా?'

'చీకటి పడకుండగనే వత్తుననియెను.'

'ఎప్పటికే గెదనని జెప్పియుండెను?'

'పైవీధి నెవ్వరో స్నేహితురాలు గలదట. ఆమెను జూచివత్తునని చెప్పియుండెను—'

ఆతండు హతాశుండయ్యెను. చేయవలసిన దేమున్నది. అత డెవ్వతెనుసందర్శించి గానానందపయోధివీచికల నూయల లూగుటకై సంకల్పించుకొని యెదురుదోచియుండెనో యాల తాంగి యింటిలేగయ్యెను. ఆమె వచ్చునని నిరీక్షించుటయా! వెనుకకు మరలిపోవుటను చిదిగూ యని తలపోయుచు నాత డొకింత సేపటనే నిలచెను. ఇంతలో నాయమ ముసలి "ఇకనో యిప్పుడో వచ్చును గాని మక్కడ కాపురముండునా? గూరు చుండు"డనియెను. ఆతండును తన మదిలో నేమాలోచించెనో లేక యామెముసలి జెప్పినట్లు జేయ నెంచెనో గాని మాటలాడక కూడ శయనాగారములోని కరిగి యుంగున్న దీపము నొకింత పెద్దదిగావించి శయనతలమున గూర్చుండెను ముదుసలియు దన కుమార్తె రాకకై నిరీక్షించుచు వీధికవాటమును మూయక యే చావడిలో గూర్చుండియుండెను.

ఆతండు శయనతలమున శయనించి తలగడలనటునిటు సవరించి పరుండబోయెను. ఇంతలో నొక కాగితపుమడత

యాతని కొతలగడక్రింద గాస్పంచియుండెను. అత డద్దానిని విప్పి దీపము మారముగా నుండుటచే మంచముపైనుండిదిగి దీపమును సమీపించి యామడతవిప్పి దిలకించెను.

అయ్యది యొకలేఖ. అది తన్నుద్దేశించి వ్రాయబడి యుండెను అతడు వింతపడి యాయుత్తర మొకసారి లోనలో నామూలాగ్రముగా జదువుకొనియెను. మరల నొక్కసారి చదువుకొనియెను. మూడవసారి యాతడాయుత్తరమును బిగ్గరగా నిట్లుచదివెను.

"ప్రియా!

తమ కీయుత్తరమును వ్రాయుటకు సంకల్పించుకొనిన మూడుగంటలకు వ్రాయగలిగితిని. నేను ముత్తరము వ్రాయుటకంటె కట్టెదుట నిలచి వృత్తాంతమంతయు దెలుపవలయునని సంకల్పించుకొంటినిగాని యట్లొనర్చుట మనుపురకును గూడ మంచిదిగాదని తలంచి యిట్లు వ్రాసితిని. నేను మిమ్ముల విడచిపోవుచుంటిని. అట్లని నావెనుక బయలుదేరి వచ్చెదరేమో? అదిలాభము లేదు. ఈయుత్తర మీకందునప్పటికే నొకటిరెండువందల మైళ్ళదూరమున నుందును. వృధాప్రయత్నములు మానుడు. ఇచ్చటనుండుటకు మనస్కరించుటలేదు కావున వెడలిపోవుచుంటిని. ఇందులకు తమరన్యధా భావింపవలదు. ఈసంగతి మా జననికిదెలుపుడు. ఇంక నీజన్మమధ్యమున మరల నింటిమొగము చూడదలచుకొనలేదు. సెలవు."

* * *

ఆయుత్తరమును జదివినతోడనే యాతనిహృదయము వికలమయ్యెను. విచారము, భయము, మున్నగురసంబులెల్ల నొక్కుమ్మడి నాతని బాధింపదొడంగినవి. ఆతడు తడబడుచు శయ్యాతలమును జేరి కూలబడియెను. "కష్టా! ఈసంతోష లేశముగూడ లేకుండబోయెనే యేమిసేయుదును. ఇప్పుడే ముదుసలి కీవృత్తాంతమును జెప్పుదునా? జెప్పకుండబోవుదునా? ఆమెయు నావలె నామెక్కె పరితపింపకమానదు. ఈచావు కబురు నేనెందులకు జెప్పవలయును" అని విచారించుకొని యాగృహమును వదలిపోవుటకు నిశ్చయించుకొనియెను.

ఇంక నాతం డాయింట నొకక్షణమైన నిలుచుట వ్యర్థమని దలంచి లేచి ముదుసలిని పిలచెను. ఆమె వచ్చినతోడనే "నీకుమార్తె వచ్చుజాడ గాన్పింపదు. రేపగుదెంచెదను. ఆమెను రేపెక్కడకును పంపకుము" అనిబల్కి యాయుత్తరమును శయనతలమున బడవైచి వెడలిపోయెను. ముదుసలియు 'కుమార్తె యింతవఱకెక్కడికి బోయియుండునా' యని విచారించుచు యామినీశేషము నెట్లో వేగించెను.



# అయిదు హత్యలా?!

## మొదటి ప్రకరణము.

హాని జరిగిపోయినది.

ప్రభాతసమయము. లోకానందకారకుఁడగు భానుని రాక నెఱింగి రాజు కళావిహీనుఁడై యుండెను. తన విరహవశ పరివర్తనము కొనసాగ నేరదని యధోలోకమునకరుగ యత్నించుచుండెను. పతి కాంతివిహీనుఁడై పశ్చిమాభిముఖుండై జారుట దిలకించి ప్రభువుతోడిదే మనుగడగదాయని తలంచి యుడుగణంబులాతని ననుగమించుచున్నవో యన నొక్కటొక్కటిగ నదృశ్యమగుచుండెను.

తొలిదిక్కున దినరాజునకు స్వాగతంబొసంగుటకు బరచియుంచిన యరుణంపురివాచీలదెఱంగున మేఘమాలికలలరారుచుండెను. క్రమక్రమంబున నామేఘమాలికలు స్వర్ణవర్ణరంజితములై యనతికాలమున దినపతి రానున్నాఁడని లోకంబునకు జాటుచున్నయవి. పిల్లతెమ్మెరలు మైసోకుటచే జనులెల్లరును శయ్యాతలంబుల విడువకుండిరి. కొందరు పరులకు దమ దేహంబుల విక్రయించినవారలు "అబ్బా! సూర్యుఁడుదయించెను. ఇంకనైన పనిలోనికేగకున్న యెడ యజమానుఁడు

కోపించు" అని ఆగ్రహపడుచుండిరి. కొందఱుభోగులు, రాత్రి యం దేసినీమాలనో, నాటకములనో జూచియుండుటచే గల్గిన బడలిక మింకను దీరకుండుటచే పరుపులనుండి లేవ జాలకుండిరి.

దినమణి యుదయించెను. కలకత్తానగరమున సూర్యోదయమైనతోడనే జనసంకులమున కేడ తెరపి లేకుండెనని వచింపనగత్యము లేదు. మోటారుబండ్లును ట్రాంబండ్లును విధివిరామము లేక బరువెత్తుచుండెను ఇంకను నిద్రమేల్కొనని భోగులను మోటారుబూరలు నిద్రబోనిచ్చుటలేదు. అట్టివారు నిద్రనుండి లేచి, 'యీదువలననే దుక్కమాలినపట్టణములలో నివసింపరాదంటు రని విసుగుకొనుచు కాల్యములఁ దీర్చుకొన నేగుచుండిరి.

హారిజనురోడ్డు 1589/5 వ గృహమునొద్ద నొకపోలీసు భటుడు నిలచియుండెను. ఆతఁడనుక్షణమునను లోనికిజూచుచుండుటచే నాతఁడెవ్వనికొఱకో నిరీక్షించుచుండె నని తెలియుకమానదు. కొంతవడి కాతని నెవ్వరోలోపలికి రమ్మని బిలచిరి. ఆతండు లోనికేగునంత నొకయువకుఁ డాతనితో "ఎందులకై ఇంతత్వరగా రావలసినదని వారెత్తబంపియుండిరో దెలియునా" యని ప్రశ్నించెను. అందుల కాభటుడు దన కేమియును దెలియదనెను. అనంతర మాయువకుఁడు, 'సరేవచ్చెదననిజెప్పు' మనియెను. "అయ్యా అట్లగాదు. మిమ్ముదగ్గర

నుండి వెంటనేదీసికొనిరావలయునని జెప్పియుండిరి. రెండు. అప్పుడే నేనరుదెంచి యురగంటమైన' దశియైను యువకుడు వచ్చెదనుండుమని లోనికేగెను.

ఆతఁ డెవ్వరో యెఱుంగుటకు పాఠకులాతురత జెంది యుందురు. ఆతఁడొక రహస్యాపరాధపరిశోధకుఁడు. ఒకటి రెండు కేసులలో పతిచాకచక్యముగా నీతఁడుపనిచేసి దోషులను బట్టి దొరతనము వారికప్పగించి యుండెను. అక్కారణమున ప్రభుత్వమువా రీతనికి నెలకు రెండువందలు రూప్యములు జీతమిచ్చుచు కలకత్తానగరమునందు యపరాధ పరిశోధక శాఖకధ్యక్షపదవి యొసంగి యుండిరి. ఈతనినామము గిరిధరలాలు. ప్రాయమున చిన్నయయ్యు మంచి యాలోచన గలవాఁడు కావున నే యెంతచిన్న నేరము జరిగినను యితఁడు ఇన్స్పెక్టరు కేశవలాలతనిని పిలిపించి యాలోచించుచుండును.

గిరిధరుఁడు రక్షకభటునితో రాఁగాకఁగి యుండెను. అట కేశవలాలు, మరి యిరువురు తగుమనుజులును గూరుచుండి ప్రసంగించుకొనుచుండిరి. వారీతనిగాంచినతోడనే స్వాగత మొసఁగిరి. గిరిధరుఁడు, సమీపస్థుఁడైన కేశవలాలుతో నించుక తేనీటినైన ద్రాగకుండగనే రమ్మని వార్తబంపిన నెట్లని యెగతాళిగ బలికెను.

'అవసరమంత కెక్కుడు దగుటచే నట్లు వార్త బంపితిని.

పమున నేయున్న యిచ్చటికి గుదెంచితిమి. మేమిచ్చటికివచ్చి యీసంగతి దెలుపగా మిస్టరుగారు తమకై వార్త బంపిరి.'

"చాలచిత్రముగా నున్నది. మీజనకున కెవ్వరితోనైనా వైరమున్నదా?'

"లేదు. అంతగర్భశత్రువులున్నటుల నేనెన్నడును వినియుండలేను."

'ఇచ్చిపుచ్చుకొను వ్యాపారమేమైన నున్నదా?"

"లేదు. మాకు సాలునకొక వేయి రూపాయల రాబడి గలదు. మాజనకు డున్నదానిని మాగ్చుకొని తినుచునే కాలము గడుపుచుండెను. నేను చదువు పూర్తియైన పిమ్మట నలుబది రూప్యములు జీతముగల యుద్యోగమున ప్రవేశించితిని. కాని యీరూప్యములను నాస్వంతఖర్చులకై వినియోగించుకొనుచుంటినే గాని నాజనకునకు నిచ్చియుండలేదు. ఇంటి ఖర్చులన్నియు నాజనకుడే భరించుచుండెను. కావున ద్రవ్యమునుగూర్చి వారి కెవ్వరితోడను తగవులుండవని నాయభిప్రాయము.

"వారికేమైనా దురభ్యాసములున్నవా?"

'త్రాగుడు, చుట్ట, మున్నగు దురభ్యాసములు లేవు.'

"ముఖ్యమైనది మరచితిని. పేకయాటో?'

"ఎప్పుడైన నాడుట కేగుచుండును గాని యదియభ్యాసములో జేరలేదని నాయభిప్రాయము.'

"మంచిది. గుణపరివర్తనములలో లోపము లేదని వచింపగలరా?'

'చెప్పగలను'

"మంచిది. నేనొకపరి యాతని శవమును జూడవలయును కాని యడుగమరచితిని. ఇంటియం దెవ్వరైన నుండిరా?'

"నా సోదరియున్నది. మే మరుదెంచునప్పటి కామె యింకను లేచియుండలేదు.'

అనంతరము వారు నలువురును బయలుదేరి యానంద కుమారునింటి కేగిరి. ఆనందమోహనుడు వారిరువురను జగ దీశుని శయనాగారమునకు గొనిపోయెను. గిరిధరలాలు పరిస రములఁగల వస్తుతతినంతయు సుశిక్షితనేత్రములతో పరిశీలించెను. కాని యందొక్కటియు ననుమానింపదగిన స్థితిలోనుండకుం డెను. పిమ్మటఁ డు శయ్యాతలమును సమీపించెను. శయ్యాతల మించుక నలిగియుండెను. మంచముపై బరుండియున్న యూ నందకుమారుని దక్షిణవక్షమున నొకబాకు గ్రుచ్చబడియుం డెను. ఆగాయముయొక్క పల్లములనుండిమాత్ర మొకించుక రక్త ము వెలికివచ్చియుండెను. ఆబాకుపిడి పట్టుకొని గిరిధరలాలు లాగివైచెను. కొలదిగ రక్తము వెలికరుదెంచెను. గిరిధరుఁడు శవము నటునిటు ద్రిప్పెను. అడుగుభాగమంతయును రక్తమ యముగానుండెను బాకు పక్కపుల్లోనికిగూడ కొలదిగా దిగి

యుండెను. గిరిధరుఁడు గదిలోనున్న పరికరములన్నిఁటిని పరిశీలించి "అయ్యా! మీయనకుఁడు చిరావ్రాఁతయు నభ్యాసము గలవాఁడుగదా?" యని ప్రశ్నించెను. ఆనందకుమారుఁ 'డగు' నని జవాబొసంగెను. గిరిధరుఁడు 'చిరా'దీసి నిలువ దేల్చి సొమ్ముతో సరిజూడుడు వీరు కొంతదిగ ద్రవ్యము రహస్యముగా ఖర్చుపరచినట్లున్న దనియెను. ఆనందకుమారుఁ డాశ్చర్యముజెంది, చిరాపుస్తకమును దిరుగవేసెను. నిలువకును చిరాకును భేదముండెను. సుమారు మూడువందల రూప్యములవఱకును నిలువయుండవలసియుండెను. పెట్టెలో నేబది రూప్యములుమాత్రమే యుండెను. గిరిధరుఁడాసంగతి నెఱింగించెను. అనంతరమాతఁ డానందకుమారున కిట్లనియెను. "ఇదిగో యీగవాక్షమార్గమున హంతకుఁడు లోనికరుదెంచెను. ఆవామీఁదిచెట్టుశాఖ నాధారముగా గొన్నయెడల సునాయాసముగా లోపలికిరావీలుండును తదుపరి హంతకుఁడేలకో తానరుదెంచిన మార్గమునగాక వీధిద్రోవనే పోయి యుండెను." అనిబల్కి మఱియు నిట్లనియెను. 'చిరా నిలువకును, యున్న సొమ్మునకును భేదముండి యున్నది. ఆకారణమున నాయనుమానము బలపడుచున్నది. నిన్నటిదినమున నీతఁడామూడువందల రూప్యములను వ్యర్థముగా వ్యయమొనరించి యుండెను. అయ్యవి యెట్లు వ్యయపరచి యుండెనో తెలిసినయెడల కేసు సులభసాధ్యమగును."

అనిబల్కి కొంతసడి యూరకుండి కేశవలాలుతో "నీవీ డెందులకై హత్యచేయబడెనని తలంతువు?" అని ప్రశ్నించెను. కేశవలాలు చిరునవ్వున 'అది నేనెట్లు చెప్పగలను. తమవంటి యపరాధపరిశోధకులే యందులకు దగినవారు' అని ప్రత్యుత్తరమిచ్చెను. గిరిధరుడు, "మిత్రమా! సర్వసాధారణముగా హత్యజరుగుటకు నాలుగైదు మాత్రమే కారణములని చెప్పవలయును. ధనాపేక్ష, అధికారాపేక్ష, మోహము, వైరము, మున్నగునవి. ఏదియో నితడేదానివలన జంపబడెనో యూహింపు' మనియెను. కేశవలాలు తనకిప్పుడది యగమ్యగోచరముగా నున్నదనియు నాతనినే చెప్పుమనియు ప్రశ్నించెను. గిరిధరుడు చిరునవ్వున నాతని కిట్లనియెను. 'నేనుగూడ నిదుపారంబసిన పొరబడియుండవచ్చును అందులకు మీరన్యథా దలంపకుడు ఈహత్యాపరాధమున కొక కాంతామణి సంబంధముండి యుండునని దోచుచున్నది." అని బల్కుచుండగనే యానందకుమారుండందుకొని "అయ్యా! మాజనకునకట్టి దురభ్యాసములేదు' అని బల్కెను. గిరిధరుడొకించుక సేపు మౌనముగానుండి "అయ్యా! ఆదురభ్యాసమున్నదనిగాదు నేననునది. ఒక కాంతామణి సంబంధముమాత్ర మున్నదంటిని. అది యభ్యాసము కాకపో వచ్చును. మరియొక విశేషము, వ్యభిచారపిశాచ మింకను బూర్ణముగ నావహించి యుండకపోవుట చేతనే చిరానిలువల

కు స్వల్పముగా తేడాయుండుటయు పెట్టెయందు దేబదిరూప్యములుండుటయు తటస్థించినది. నేను తలంచినట్లు కాకున్నయెడల నీపెట్టెలో రూప్యములుండుటయు, మీనాయనగారి మెడలోని బంగారుగొలుసు నష్టేయుండుటయు తటస్థించియుండదు. వచ్చినవాఁడెవఁడో ధనముకొఱకై వచ్చియుండ లేదనుట పైనిదర్శనములవలన స్పష్టమగుచున్నది. హంతకుని మార్గమున కీలడ టంకముగా నుండుటచే నీకేసు తొలఁగింపబడియెను." అని విమర్శనపూర్వకముగా పల్కెను. అతని పెక్కులాలించి వారందఱును విభ్రాంతపడిరి. అనంతరము, గిరిధరుఁడు శవమును పోస్టుమార్టమునకు బంపవలసినదనిచెప్పి ఆనందకుమారునిబిలిచి 'సమారెనిమిదిగంటలు కావచ్చినది. మీసోదరి మేల్కాంచి యుండును. ఆమెకు మెల్లన నీవార్త దెల్పి యామె జనకు నొకసారి చూడదలచినయెడల నామె నిచ్చటికి దోడ్కొనిరమ్ము, మే మావలికేగెద"మని బల్కెను. ఆనందకుమారుఁడు లోనికేగెను. గిరిధరాదులు చావడిలోని కరుదెంచి యటనున్న కుర్చీలపై కూర్చుండిరి. ఆనందకుమారుఁడు తనసోదరియగు శ్యామలతో జనకుని శయనాగారములోని కరిగెను. శ్యామల జనకునిగాంచినంతటనే పెద్దపెట్టున నేడ్వసాగెను. ఆనందకుమారుఁడు పెక్కువిధముల నామెనూరడించి యెట్టకేల కామెను మరల లోనికిదోడ్కొనిపోయెను.

* * *

శవము జనరల్ హాస్పిటలునకు బంపబడెను. ఆనంద కుమారుడింటనుండి పరిశోధకమహాశయులను దోడ్కొనుచుండెను. ఆనందకుమారుని స్నేహితుడగు శశిభూషణుడు మాత్రము హాస్పిటలునకేగియుండెను. గిరిధరుడు హత్యకు గల కారణములను నుత్తరువులుగాని కాగితములుగాని లభించునేమోయను సందేహముతో నానందకుమారుని బిలిచి "అయ్యా! నేనెయ్యది యీహత్యకు కారణమైయుండెనని భావించియుంటినో యాయభిప్రాయముతో పరిశోధనకుపక్రమింతును మీకు సమ్మతమేనా" యని ప్రశ్నించెను. ఆనందకుమారుడు "అయ్యా! మీరెట్లు కార్యసాధనకుపక్రమించినను సరియే మా కుటుంబ గౌరవమును ముందుగానుండి రక్షించు భారమునుగూడ నేను తమచేతులనిడుచున్నాను. మాజనకుని జంపినద్రోహిని యురికంబముల కెక్కింపగలిగిన యెడల జనకుని యాత్మకు శాంతికలుగునని యే నాయభిప్రాయము" అని బల్కెను. ఆపల్కులాలించి గిరిధరుడానందకుమారునితో నిట్లు సంభాషించెను.

"నీసోదరి శ్యామలకేల యింకను వివాహముచేయలేదు? ఆమె కరగ్రహణమునకాశించి యెవ్వరైన ప్రయత్నించుచుండిరా?"

"లేదు. ఆమెవివాహవిషయప్రసంగ మెప్పుడును రాలేదు."

"నీవనుదినమునను నింటబరుండుచుందువా?"

'ఇంటనే యుందును'

"సాయంకాలము మింటి కెన్నిగంటల కరుదెంచు చుందువు?"

"సుమారేడుగంటలకు."

'నీవరుదెంచునప్పటికి మీజనకుడెప్పుడును నింట నుండునా? లేక నీవరుదెంచిన పిమ్మటనే యింటికరుదెంచు చుండునా?'

"సర్వసాధారణముగా వారే వాహ్యాళినుండి నాకంటె మున్నగ నరుదెంచుచుందురు."

'సుమారెన్ని గంటలకు వారింటినుండి వెడలుదురో నీకు దెలియునా?'

'మూడుగంటలైన పిమ్మట'

"మంచిది. వారిపెట్టెలో నేమైన నున్నదేమో పరి శీలింపవలసియున్నది'

"సందేహింపకుడు"

ఆనందకుమారుడు పెట్టెను దెరచెను. గిరిధరుడు, ప్రతికాగితమును పరిశీలించుచుండెను. కొలదికాగితములైన పిమ్మట నొకపాతడైరీలభించెను. ఆడైరీపుస్తకములోని యంశము లటునిటు దిరుగవేసెను. ఆపుస్తకము నొకచోటనుంచె ను. పెట్టెయడుగుభాగమున మరికొన్ని డైరీపుస్తకములుండెను. గిరిధరుడు తొలుత, తానుగాంచిన డైరీపుస్తకము పుర

జూచెను. అయ్యది గతసంవత్సరపు డైరీ! "ఆనందకుమార్ ఈసంవత్సరపు డైరీ కాన్పింపదే' మని ప్రశ్నించెను.

"ఈసంవత్సరము డైరీ వ్రాయుటమానితి."

"ఎందులకో యెఱుంగుదువా?"

"ప్రతిసంవత్సరమునను వ్రాయవలసిన యంశములు లేక నిష్కారణముగా డైరీకొంటిననుకొనుచుండెడివాఁడ. ఈ సంవత్సరము డైరీకొనుటలేదే"మని ప్రశ్నింపగా, "కొనదలచుకొనలేదు. అనవసరముగా డైరీకొనుటయేగాని వ్రాయుటకేమియును గాన్పింపదు' అని నాకు ప్రత్యుత్తర మిచ్చెను.

గిరిధరుఁడు మాటలాడకుండ డైరీ తిరుగవైచెను కాని ఒక్క కాగితమైనను విడువబడియుండలేదు అక్కారణమున నాతడేమో కొంతవడి యాలోచించి ఆనందకుమారునితో 'ఇప్పటికే పొద్దుపోయినది, అవసరము న్న సగము వచ్చెను నీవుకూడ మనకుపకరించుమని యోచించి కాగితము లిచ్చినాను నేమో పరికించుచుండును నే నీడైరీయందలి వ్రాఁతను కొనిపోయి పరిశీలించి తిరుగ గొనివచ్చెదను.' అనిబక్కు కేశవలాలుతో మాటలాడుచు నరిగెను.

## ౨వ ప్రకరణము.

---

### ఆలోచనము — అరెస్టువారెంటు.

గిరిధరుడింటనొక ఈజీచైరుపై బసకి డైరీపుస్తకమును పరిశీలించుచుండెను. ఆతడు ప్రతిపత్రమును జాగరూకతతో దిరుగవైచుచుండెను. ప్రతియక్షరమును యెక్కుడుగా విమర్శించుచుండెను కాని ఆతని యభిప్రాయమును బలపరుపదగిన సూచనమేమియును నింతవరకు గానుపింపదయ్యెను. ఆతడెంతయో దీక్షతో జదువుచుండుటచే లోనికరుదెంచిన కేశవలాలును గూడ గనుపింపడయ్యెను. కేశవలాలొకటి రెండు నిమిషములు నిలువబడి 'గిరిధర! ఏమింత దీక్షతో జూచుచుంటివి" యని ప్రశ్నించెను. గిరిధరుడు పుస్తకమునుండి దృష్టిమరల్చి "దయసేయుము. డైరీపుస్తకమును దిరుగవైచుచుంటిని" అని బల్కెను. కేశవలాలు సమీపమునందున్న యొకకుర్చీపై గూర్చుండి "అన్నా! ఈ కేసంతయు నగమ్యగోచరముగా నున్నది. ఎవ్వరు యెందులకై హత్యజేసిరో — యెట్లు గృహమునుండి తప్పించుకొనిపోయిరో తెలియరాకున్నది. ఇంటనున్న శ్వానమునకించుకంతైన యలికిడి వినబడకుండ హంతకుడెట్లు వీధిద్వారమున వెడలిపోయుండెనో యూహించుటకైన శక్యము గాకుండనున్నది.

ఇంకొక చిత్రము 'ఎట్టి కేసునకైన నీమార్గము ననుసరించిన ఫలము గలుగవచ్చునను నాశయైన నుండును గాని యీ కేసునకీమార్గమున యత్నించిన మేలుకలుగునని యాశించుటకైన నవకాశము లేదు." అని బల్కెను.

గిరిధరు "డయ్యా! ప్రపంచము మారిపోయినది. చేసిననేరమును గ్రమ్ముకొనుమార్గములు వెల్లడియైనవి. ఇంకను పాతపద్ధతుల బట్టుకొని ప్రాకులాడునంతటి తెలివిమాలిన వారు లేరు. నేరములుచేయుట, చేసి పట్టుబడకుండుట, తమ నేర మితరులపై నారోపించుట మున్నగుకార్యముల యందు ప్రావీణ్యము లేనివారు లేరనియే జెప్పవచ్చును. అట్టియెడ కేసులను బట్టుకొనుట సామాన్యముగాదు. ఆవిషయముమటుంగ చుండు. ఈ కేసువిషయమునై యాలోచింపుడు ఇంత కట్టుదిట్టముగా నింత నేర్పరితనముతో, పత్తేదారులకైన నిసుమంత యాచోకిదొరుకకుండ హత్యగావించి వెడలిపోయినాడు. ఇంగుల కాపాంతకుని ప్రశంసింపవలసియున్నది. అయినను ఇపుడు నే ననుసరించుమార్గమే సరియైన దని యూహించుచున్నాను. ఈకైరీ సంపూర్ణముగా పరిశీలించినపిమ్మట నాయనుమానము స్థిరపడునను నమ్మకమున్న" దని బల్కెను.

కేశవలా లంతట నూరకొనక 'నగమునకు పైగా జూచితిరిగదా? ఏమైన విశేషాంశములున్నవా?"

'లేవు'

ఇట్లు ప్రసంగించుచునే గిరిధరుఁడు కాగితములను దిరుగవైచుచుండెను. నాలుగైదు పత్రములను దిరుగవైచిన పిమ్మట నాతఁడేమిదిలకించి యుండెనోగాని—యాపేజీ మరల చదివెను. ఇంకొకమారు మరలచదివెను. ఇంకొకమారు చదివెను. అక్షరములపోలికకై గాబోలును వెనుకనొకటి రెండు పత్రములను దిరుగవైచెను. ఒకింతతడవాలోచించెను. అతడట్లాలోచనాధీనుఁడై యుండుట గనిపెట్టి—కేశవలాలు—"మహాశయా! ఏమట్లాలోచించుచుంటిరి' యని ప్రశ్నించెను. గిరిధరుఁడు 'యీవాక్యముల యర్థము స్ఫురింపక యాలోచించుచుంటిని వినుఁ' డని యా దినచర్యపుస్తకమునుండి యిట్లు చదివెను.

"ఆరు సంవత్సరములనుండి గడిపిన ప్రవర్తన మాకస్మికముగా మారిపోవునది నూతనప్రవర్తన కారంభదివసము—కలనైన దలపనియట్లు ప్రవర్తనము మారుట విధివిధాన మనుల్లంఘనీయమనుటకు దార్కాణమయ్యెను.'

కేశవలా లందలి యభిప్రాయము మొకింత దెలిసియు సంపూర్ణముగ నాతనివలన నెఱింగి దనకేమియు నాలోచన దట్టలేదని బల్కెను. పై వాక్యముల కిట్లు గిరిధరుఁడు వ్యాఖ్యానమొనరించెను.

'ఈతనిభార్య చనిపోయి యారు సంవత్సరము లైనది. కాని యీతఁడారువత్సరములనుండియు విషయభోగ విముఖు

డైయుండెను. కాని ఈవార్తి వ్రాసినదినమున తలచనితలంపు గా నాతనిమనంబు చలించినది. అప్పటినుండియే యాతండా క కాంతామణీ మోహవాగురుల జిక్కుకొనియుండెను. అనగా నీవ్రాత నవంబరు నెల 25 వ తారీఖున వ్రాయబడియుండెను. ఫిబ్రవరి 20 వ తేదీని వధింపబడినాడు." అనిబల్కి వెండియు నిట్లనియెను "ఈయక్షరములు నాయభిప్రాయమును బలపరచు చున్నవి. ఇప్పుడైన నా నందకుమారుడు తనతండ్రి దురభ్యాస లోలుడు గాడని వాదించుట పొరబాటని యొప్పుకొనునుగా" యని యొకింతసంతసమును బల్కెను.

కేశవలాలు "గిరిధరా! పైవాక్యములాతని ప్రవర్తన మారినదని యోచించుచుండుట నిక్కమును గానీ యూవ ల్కలు హంతకుని బట్టియిచ్చుట కసమర్థయు జనికిరావు గదా?' యని బల్కెను గిరిధరుడు చిఱునవ్వున 'నీపలుకు లు యథార్థములై యెన నీయపరాధమునంటల దోషి యెట్టి వాడో నిరూపణచేయుచున్నవి ఇంతను మించిన యాధార మేమియును లేదు. కనుక కొలదిగా నాలస్యమగు'నని తోచు చున్నది.

ఇట్లు సంభాషించుకొనిన యనంతర మానందకుమారుని గలసికొననేగిరి ... ... ...

గిరిధరుడాతనికి డైరిలోని వాక్యములను జూపి "చూచి తివా నీవు! మీజనకుని శీలమునుగూర్చి పొరబడియుంటి'వని

బల్కెను. ఆనందకుమారుఁడాశ్చర్యమగ్నుఁడను జెందెను. అప్పుడది గమనించి గిరిధరుఁడు "ఓయీ! యింక మనము గతమును గూర్చి విశేషముగా నాలోచింపనక్కర. కర్తవ్య మాలోచింప వలయును. మీజనకుని మనంబును చలింపజేసిన వనితామణి యెవ్వరో కనుగొనవలసియున్నది. ఆమెవలనగాని యామెను ప్రేమించిన మరియొకరి వలనగాని యీహత్య జరిగియుండవచ్చును. కొలఁది ప్రయత్నమునఁ హంతకునిఁ గనుగొన వచ్చును. కాని నీవింకొక పనిమాత్రము చేయుము. మీజనకుని సొంతరంగికమిత్రు లెవ్వరైన నున్నయెడల వారలకడకేగి నడచిన వృత్తాంతమంతయును దెల్పి వారివలన మీజనకుఁడీ మూఁడు మాసములనుండి యెక్కడికేగుచుండెనో కనుగొనుము. అందువలన మనప్రయత్నములు త్వరలో ఫలింపగలవు' అని పల్కెను.

ఆనందకుమారుఁ డాతని యుక్తుల కంగీకరించెను.

సామాన్యమగు పట్టణమున పేరుదెలిసియున్నను గృహనామముగాని యాతఁడు నివసించు గృహముయొక్క గుర్తులుగాని (సరియైన చిరునామా గాని) దెలియకున్న యెడల నా మనుష్యుని గుర్తించు టసాధ్యముగదా? అట్టియెడ నొక మహాపట్టణము—విస్తారమగు జనసంఖ్యగల్గిన కలకత్తా పట్టణమున పేరునుయూరును దెలియని యొకవ్యక్తి నన్వేషించుట కేవల మసాధ్యమని వేరె జెప్పవలయునా?' యని దలపోయుచు కేశవలాలి హత్యాపరాధ పరిశోధనమున గిరిధరుఁడు

కృతకృత్యుఁడు కాజాలడని గుణించుచుండెను. గిరిధరుఁడన్ననో యత్నమున సాధింపరాని కార్యములుండవను విశ్వాసముతో దీక్షతో పనిచేయుచుండెను



కలకత్తానగరమున వేశ్యలకు తావలమై పెక్కురు విటశేఖరుల నాకర్షణచేయుభాగములు పెక్కులున్నవని చదువరులకు విదితమే. అందునను ఒక్కొక్క వారకాంతగృహమున నెందఱందఱో యువతీమణులు నివసించుచు తమ్మాదరించినవారికి విటుల నాకర్షించుటలో తోడ్పడుచుందురు. అట్టియెడ గిరిధరుడు యేభాగమున నేయువతీమణి యానందకుమారునిజనకుని తనవంక కాకర్షించుకొనెనో కనిపెట్టవీలగునా యని చదువరులు సందేహింతురేమో వలదు. వలదట్టి సందియము. గిరిధరుఁడు కలకత్తానగరమునఁ బుట్టిపెరిగినవాఁడగుటచే నాపట్టణమును సంపూర్ణముగా నెఱింగియుండెను. మరియు నాతఁ డుద్యోగరీత్యా నాపట్టణమునందలి యేభాగమునందలి జనులు నేరములొనర్చుటయందు ప్రవీణులో దెలిసికొనియుండెను. మరియు నానందకుమారుఁడు తన జనకుఁడు తరచుగా లోయర్ చిట్పూరురోడ్డుననే బోవుచుండునని వినియుండుటచే మారువేషమున నావీధియందే దిరిమ్మరుచు పెక్కురగు గణికాంగనల గుణప్రవర్తనములను పరిశీలించుచుండెను.

ఒకమాసము దినములు గడచిపోయెను. కాని గిరిధరలాలు కృతకృత్యుఁడైనట్లు గాన్పింపదు. పైయధికారులూరక గిరిధరుని యాయపరాధపరిశోధనము త్వరలో ముగింపవలసిన దనియు దొంగనోట్లను సృజించు ద్రోహులను బట్టుకొనుటలో పోలీసువారికి దోడ్పడవలసిన దనియు తొందర పెట్టుచుండిరి. గిరిధరుఁడును త్వరలో కార్యమును సాధింపవలయునని యత్నించుచుండెను.

ఉదయము 9 గంటలైనది గిరిధరుఁడు పోలీసుఠాణాకరగెను. కేశవలాలాతని గూర్చుండవలసిన దని బల్కెను గిరిధరుఁడు గూర్చుండక —5 గురు రక్షకభటులతో నాతని దనవెంట రావలసిన దని కేశవలాలును త్వరపెట్టసాగెను కేశవలాలెందుల కేమిటికెక్కడకు పోవలసియున్నదని ప్రశ్నింప నారంభించెను. కాని గిరిధరుఁడు—ఆతనికి ప్రత్యుత్తరమొసంగక—జాలముచేసిన కార్యము మించిపోవును లెమ్ము. యని మాత్రము బల్కెను

గిరిధరుఁడును, కేశవలాలును, మఱైదుగురు పోలీసు భటులు నొకపోలీసుకారుపై గూర్చుండిరి. గిరిధరుఁడు కారు డ్రైవరుతో 1978/5 లోయరు చిట్పూరురోడ్డునకు త్వరలో కారును బోనిమ్మనియెను. కారు శరవేగమున బోవుచుండెను. అయ్యది పోలీసుకారగుటచేతను యందు ఇనస్పెక్ట

రును పత్తేదారును యుండుటను జూచి రక్షకభటు లాకారు నకు మార్గమున నెట్టి యాటంకమును గలుగనీయరైరి.

*    *    *    *    *

గిరిధరుఁడు డాక్టరుతో కారునాపెను. అందుండి యెల్లరు ను దిగిరి. గిరిధరుఁడు రక్షకభటులను కొందఱిని జూపి "యీ మఠములోనుండి యెవ్వరును యావలికేగకుండ జూచుచుండుడు. మేమిరువురమును తలుపులను తెరపించుకొని లోని కేగుదుము." అని బల్కి కేశవలాలును తనవెంట రావలసిన దని చెప్పెను. వారిగురువుగారి గృహమును సమీపించు నంత కొకమోటారు సైకిలు మీఁది కెదురుగా వచ్చి యాగృహము చేరనాగెను. ఆ సైకిలునుండి దిగిన యాతఁడు డాక్టరగు అతఁడు గిరిధరుని గాంచి పలుకరించెను. గిరిధరు డాతనిసమీ పించి "ఎచ్చటనుండి వచ్చితి"వని ప్రశ్నించెను అగంతకుఁడు "యీ యింటినుండి తక్షణమే రావలసినదని ఫోనులో నెవ్వరో జెప్పిరి. అందులకై వచ్చియుంటి" నని ప్రత్యుత్తరమిచ్చెను గిరి ధరుండంతట నూరకొనక 'నీతో కొంచెము మాటలాడవలసి యున్నది. లోనికేగి రమ్ము మే మిచ్చటనే యుందుము" మని బల్కెను. డాక్టరుబాబుమంచిదని గుమ్మములనెక్కి తలుపు తట్టెను. తలుపు తెరువబడియెను. డాక్టరు లోనికేగెను గిరి ధరుఁడును కేశవలాలును యాతని వెంటనే లోనికేగిరి.

'నన్నేల రావలసిన దని నర మామనుచిరి?"

"అయ్యా! ఇక్కడిరువురు పొడుచుకొనిరి. ఒకఁడు మాత్రమే కొనయూపిరితో నున్నాఁడు. మీ రాతని కేమైన చికిత్సయొనర్పఁగలరేమో పరిశీలింపఁగలరు'

'ఆతఁ డెక్కడనున్నాఁడు?—

'ఆప్రక్కగదిలో'

ఈపల్కులన్నియు గిరిధరుఁ డాలించి యుండెను. డాక్టరు ప్రక్కగదిలోని కేగెను. గిరిధరుఁడును కేశవలాలును గూడ లోనికేగెను. డాక్టరుబాబు నివ్వెరపడియెను. గిరిధరుఁ డాతనితో "నయ్యా! మేమును ఇచ్చటికే వచ్చియుంటిమి. వీరిలో నొక్కఁడేని జీవించువనునాశ గలదేమో పరికింపుఁడు—"

డాక్టరుబాబు పరీక్షించెను. ఒక్కనిమేన నించుక జీవమున్నటులఁదోచెను. ఆతని నాడుల పరిశీలించెను. ఒకయింజెక్షనొసంగెను. ఆతఁ డించుక తెప్పరిల్లెను. దాహమునకనుసన్న జేసెను డాక్టరొకమందును నీరునునోట బోసెను గిరిధరుఁడు 'డాక్టరు మహాశయా! జీవితాశయున్నదా!' యని యాత్రతతో ప్రశ్నించెను. డాక్టరు 'లేదు లేదు ఇంక కొన్ని నిమిషములలో నీతఁడు కథావశేషుఁ డగును." అని పల్కెను. ఆమనుజుఁడు కన్నులు దెరచి చూచెను. డాక్టరుబాబు పలుకుల నాతఁడు వినియుండుటచే గాఁబోలును మరణ వాఙ్మూలమును దీసికొనవలసిన దశయెను.

'చేసిన పాపమునకు దగిన ప్రతీకారమును బొందగలిగితిని. తుచ్ఛమగు వ్యామోహమున బడి ఘోరమగు పాపమున కొడిగట్టితిని. వేరొక వేశ్యనొక వత్సరమునుండి పోషించుచుంటిని. ఇట్లుండగా మనోహరసేనుఁడను నాతఁ డామెను కామించి యామెను దనవలలో దగుల్కొనజేసెను. నేనాతనితో నొకటి రెండుసార్లు నిగూఢముగ నామెపొం దాపదలకు మూలమని జెప్పియుంటిని. కాని యతడు నాపలుకులాలింపడయ్యెను. ఒకనాడు నే నామెగృహమునకు కేగునంత నాతఁడచ్చటినుండి వెడలిపోవుటజూచితిని. పట్టగాని కోపమున నాతని నా నాఁడే కథావశేషునిగా నొనర్చితిని.'

గిరీశ్వరుఁడాతని నాపి ఆవిషయము నాకిదివఱకే విదితమయ్యెను. కాని యొకటిరెండు సందేహములు గలవు

"సందేహము లేమిగలవు?"

"నీవు లోనికెట్లుగితివి మగల నేగునప్పుడు వీధికవాటము దెరచికొని యేల పోవలసివచ్చినది."

"అతిప్రయాసముననే లోనై గోడదాటి యావరణములో ప్రవేశించితిని. అచ్చటినుండి యొకచెట్టుకొమ్మ నాధారముగా గొని లోనికేగితిని. లోనికి దిగినవెంటనే యాతనిని బొడిచివేసితిని. బాకుదీసిన యెడల రక్తము వెలికి జిమ్మునని దీయనైతిని. ఆతఁడు కేకలువేయ నుంకించెను. కాని నేను యాతనిగొంతుక నదిమిపట్టితిని. రెండుమూడు నిముసము

లలో నాతఁడు మరణించెను. మరల వచ్చినమార్గమున పోవ నెంచితిని కాని గోడమూకి నేనేవీధిలోనికేగవలసి యున్నదో యావీధిని పోలీసుభటులు గస్తి దిరుగుచున్నట్లు వారి యీలలవలన దెలియవచ్చినది. అందువలన వీధితలుపు దెరచికొని వెడలిపోయితిని.'

"నీవు హంతకుఁడవని యీ నిమిత్రునకెట్లు దెలిసినది?"

"నేనె యాతనికి బుద్ధిహీనుఁడనై దెలిపితిని. నేనీతఁడు నిక్కంపుమిత్రుఁడని భావించి పొరబడియుంటిని ఈతనికిని యాగణికకును తొలుతనుండియు మైత్రియుండెడిది గాబోలును. నారహస్యమంతయును బూర్ణముగా నెఱింగినప్పటినుండియును నీతఁడు బహిరంగముగా నాకండ్లయెదుటనే యాగణికతో సరసములాడుటకు ప్రారంభించెను. అందువిషయమై యొకటి రెండుసార్లు బెదరించితిని కాని వాఁడే నన్నెక్కుడుగా భయపెట్టుచుండెను అనుదినంబునను వాడు పోలీసులకు నీసంగతి దెలుపునని బల్కుచు నన్ను దన చేతిబొమ్మగా జేసికొనియెను.

"నిన్ను మీరికిరువురకును వాక్కలహ మేల గలెను?'

"రెండుకత్తులొక యొరలో నిముడవుకాన నిరువురము ను దెగతెంపుచేసికొని విడిపోవుట మేలనుకొని యాతనిని జూడనేగితిని. ఆతనిని గలిసికొంటిని. కొంతవఱకాతఁడు

నెమ్మదిగనే మాటలాడెనుగాని నేను ఇంకను గదిలో నొకరామెను విడువవలసియున్నదని జల్పించినోడనే యాయాడు మైమునకు కేకలు వేయసాగెను. తదుపరి యాయాడామెను విడువ వనియునూ, నివికనామెకొరకు రావలయునియును నిప్పష్టముగా జెప్పివైచెను. అంతటితో మైపతగవులాట ప్రారంభించినది. అది యీవిధముగా ముగిసినది'

'నీవిచ్చట కేలవచ్చితివి?''

'ఇంక నాతనివలన నాకెట్టిభయమును లేకుండ జేసికొనుటకు'

''నీకీగుండ్లు యెట్లుగ లెను?''

'నేను పట్టుజాలసికోపమున బాకుదీసి పొడువబోయితిని. అంతలో నాతడు చేతుపాకితో నన్నుగాల్చినాడు. ఆదెబ్బ తప్పిపోయినదని గుర్తించినతోడనే బాకుతో గూడ నాతని పైబడి పొడచివేసితిని. బాకుసరిగా గుండెలో దగులుటచే నాతడు వెంటనే మరణించెను. గుండు నాహృదయమునకీవల నే దేహమును జొచ్చినదిగాని లోపలిభాగమును దొలిచివైచినది. అందువలన నింతదనుక జీవింపగల్గితిని—'

ఇంతలో నాతనికాయాసమువచ్చెను. రక్తమావలకే యెక్కుడుగా పోయియుండుటచేత డాక్టరుబాబు పరీక్షములు వ్యర్థమయ్యెను. గిరిధరు డయ్యయో యాకాంతామ

ణి పేరైన గనుగొనవైతిని గన్నాయుని చింతించుచుండెను. అపుడే యాహంతకుని ప్రాణవాయువు లెగసిపోయెను.

హంతకునిబట్టి యీయురికంబముల కెక్కింపదలచిన గిరిధరుడు హతాశుడై గృహోన్ముఖుడయ్యెను.

## మూడవ ప్రకరణము.

న్యాయస్థానము — పునఃప్రయత్నము.

నేడు న్యాయస్థానమంతయు జనుల యొలజలితో నిండియుండెను జనులెల్లగును "వింతగా నొక్కవనితామణికై ముగ్గురు యువకులు మరణించిరట. ఆహంతకులయొక్క చరిత్రమును, వారలను గిరిధరులాలుయనుహాశయ డెల్లు పట్టుకొనిరదియు, నేడు బహిరంగపరుపబడునట. అని యొకరితో నొకరు వింతగా జెప్పుకొనుచుండిరి. కొందఱొకచోజేరి ముగ్గురను జంపిన ప్రతిభాశాలినియగు నావారాంగన యెంత నేర్పరియో యని దలపోయుచుండిరి. మరికొందరిట్టి త్రిజగన్మోహినియగు వారాంగనను సందర్శింపవలయునని సమీపముననున్న వారి నావారాంగనగూడ న్యాయస్థానమునకు గొనిరాబడునాయని యడుగుచుండిరి. కొందఱు వారిప్రశ్నముల కెగతాళిగ ప్రత్యుత్తరముల నొసంగుచుండిరి.

సుమారు 12 గంటలు కావచ్చినది. న్యాయాధిపతి పీఠ మెక్కెను. గిరిధరలాలుగూడ నుచితస్థాన మలంకరించెను. ఇన్‌స్పెక్టరు కేశవలాలు, ఆనందకుమారుడుగూడ గిరిధరు నకు గొలదిదూరమున గూర్చుండియుండిరి. న్యాయాధిపతి లేచి తొలుత యానందకుమారుని ఫిర్యాదుచదివి యందుపై దొరతనమువారు — గిరిధరుని పత్తేదారుగా నియమించిన యార్డరును జదివెను.

గిరిధరుడు లేచి దొరతనమువారిచే నియమింపబడిన నాటినుండియు నేనీ కేసునందు పనిచేసియుంటినిగాని మనోహరసేనుని వధించిన హంతకుని సజీవునిగాబట్టి బంధించి యిచ్చుట నిలుపజాలనందుల కెక్కుడుగా విచారించుచున్నాను. హంతకుడు నేర్పరియగుటచే నాతడు మనోహరసేనుని బొడిచిన బాకును వెలికిదీయలేదు. ఇంతియెగాక — యాతడు తనమనోహారిణియగు వారాంగనకేని యీవృత్తాంతమును జెప్పియుండ లేదు. కాని యాతడెవ్వనిని ప్రాణమిత్రునిగా నమ్మియుండెనో యాతనితో నీవృత్తాంతమును జెప్పియుండెను. ఆమిత్రున కావారాంగనతో మైత్రియుండుటచేత నీహంతకుని యాతడు దన యిచ్చవచ్చి నశ్లాఘించుచుండెను.

నేనును సర్వసాధారణముగా వేశ్యలువసించు వీధుల న్నిటియందునను, యందునను యానందకుమారుడు తనజన కుడు లోయర్ చిట్పూరురోడ్డున కేగుచుండెనని దెలుపుట

చే యావీధియందునను దిరుగుచు నావీధిని దరచుగా గాన్పిం చువారల ప్రవర్తనాదికముల నరయుచుంటిని ఈహంతకుఁ డనుదినమునను యావీధియందు పలుసమయముల నొక్క యింటికడ గాన్పించుచుండెను. ఆకారణమువలన నాతని నను మానించి యాతని ప్రవర్తనమును గనిపెట్టుచుంటిని. ఒక నాడు సూర్యాస్తమయసమయమున నీతడును మరియొక పూరుషుఁడును తెగవ్రాలాడుచుండిరి. వారిసంభాషణవలన నీహంతకుఁడాతని కొంగలలో లోబడియుండెనని తోచినది. కాని యిదమిత్థమని నిర్ణయించుట కప్పుడవకాశము చిక్కినది కాదు. రాత్రి నేనింటికరిగి వారివాక్యములన్నియు నవిమర్శన పూర్వకముగా చర్చించుకొని యారెండవయాతనిబట్టి నిర్బం ధపరచినయెడల గొంతవరకు లాభముండునని తోచినది. ఉదయమునసే నేను కాలోచితకృత్యముల దీర్చికొని నావ ెంట యిద్దరుకావలి వారిని పిలిపికొని సంగతులన్నియు దెలిపి అరె ష్టువారంటు వ్రాయించి రక్షకభటులతో నానూతనుని గృహమున కేగితిని. అచ్చట నానూతనపురుషుఁడును, హంత కుడునుగూడ నొండొరుల బొదువుకొని పడియుండిరి. హం తకుడింకను కొంచెముప్రాణముతో నుండెను, అతఁడొసంగిన మరణ వాఙ్మూలమువలన నీరెండుహత్యలు కాతఁడే కారణభూతుఁడై యుండెనని విదితమగుచున్నది గాని యాతఁ డేరమణీమణిని ప్రేమించి యిట్టిఘోరపాపముల నాచరించియుండెనో యింతవ

నాటికి న్యాయస్థానము ముగియబడెను... నాలుగు దినములు గతించునంతకు గిరిధరలాలునకు ప్రభుత్వమువారియొద్దనుండి—ఇంకొక మూడుమాసములు గడువొసంగితి మనియు గడవులోపల యావారవనిత నన్వేషింపజాలకున్న యెడల నా కేసును వదలివైచి నోట్లసృష్టినిగురించి జరుగుచున్న పరిశోధనమున పాల్గొనవలసినదనియు యుత్తరవు వచ్చెను. గిరిధరుఁడు గూడ యావనితామణి నన్వేషించి యామెకీ హత్యలతో నెట్టి సంబంధమున్నదో కనుగొనవలయునని దలంచుచుండెను. అందుకనుగుణ్యముగా ప్రభుత్వమువారు గడువొసంగిరని యాతఁడెంతయో సంతసించెను.

నాటిసాయంకాలమున నాతఁడొంటరిగా గూరుచుండి యిట్లు వితర్కించుచుండెను. హంతకుని మరణవాఙ్మూలమున యామానునకును యామెకును చిరకాలమునుండి సంబంధము గలదని సూచింపబడెను. అట్టియెడ నాతఁడు మనోహర సేనుని వధించిన హంతకుఁడు నీపోటుఁడని యామెకేల జెప్పకుండెను? చెప్పియెడల నామె యా హంతకునియెడ విరక్తి జెందకుండునా? ఆమెయే యామానుని హెచ్చరించి జాగరూకతతో నుండుమనియు, యెల్లప్పుడును రివాల్వరు గాని బాకుగాని చెంతనుంచుకొనుమనియు జెప్పియుండునా? లేనియెడల నొకసారి జాపిన మహాశయుఁడు నన్నుమాత్రిమే పట్టుచుగా యపసవ్యేమైనది మహాశయుఁడే యాయుధమును దనచెంత నుం

చుకొనెనా ?......... ఇంకొక్క విశేషమున్నది ఆమెయొక నితో సంబంధము గల్గియుండియు నితరులయెడ ప్రేమ నిల్పు టకు హేతువేమైయుండును. అతనిపరిస్థితు లెట్టివి. అతఁడు నిశ్చయముగా ధనికుఁడు గానియెడల నామె వానినివలచి కే సాగనంపి యుండును. ఒకానొక వేళ యాతడొసంగునది స్వల్పమై యుండవచ్చును. అందుచే నామె పరపురుషుల దనవంక కాకర్షించుకొని యుండును. కాని యందుఁ కొక్క సందేహము గాన్పించుచున్నది. హంతకుఁడు నిరుపేదయై యున్నయెడల మనోహారసేనుని వధించునపు డాతనియెడ నున్న బంగారునగలుసున్నైనను గొనిపోయి యుండును. కాని యట్టిది జరిగియుండలేదు. కావున నాతడు ధనికుఁడనియే తలంపవలయును... కానిమ్ము, ఫోటోలను అప్పగించునట్లనును బంపితినిగదా? వానిలో నెవ్వానిని నాతనియునికి ట్టును దెలుపగలిగినయెడల నిజస్థితి నెఱుంగుటకు వీలగును. ఆహా! ఎంతచిత్రముగానున్నది. ఈతఁడు హంతకుఁడని నిర్ణ యమైనపిమ్మట మరణించెను. మరణించినను గూడ యాస్థితి గతులను గూర్చి తెలిసికొనవలసివచ్చెను.

ఇట్లు తఁడు సాయంకాలమువఱకును గడిపి తమపరి యొకింతవిశ్రాంతిదీసికొన కట్టునకేగవలయునని బయులు దే రెను. మార్గమధ్యమున నాతఁడేమాలోచించు కొనెనో గాని కట్టునకేగుటమాని నోయన్ చిటూప్రారుగర్భమున కరిగెను.

1978—5 నెంబరు గృహమును సమీపించి తలుపు తట్టెను లోపలినుండి యొక యువకుఁడు వచ్చి తలుపు తెరచెను. గిరిధరుఁడు లోనఁ బ్రవేశించి యాయువకునితో "నయ్యా! తము తో కొన్ని మాటలాడవలసియున్నది సమయమిత్తురా యని ప్రశ్నించెను. యువకుఁడాతనిని సగౌరవముగా లోనికిఁదోడ్కొనిపోయి "అయ్యా! ఆ యాసనముపై గూర్చుండుడు. తమరేవిషయమునుగూర్చి మాటలాడ నెంచితిరని ప్రశ్నించెను. గిరిధరుఁడాసీనుఁడై "అయ్యా! అయిదారు దినములకుమున్ను గృహమున సిగురుగు మనుజు లొకరికొకరు పొడుచుకొని మరణించిరను సంగతి తమకు దెలియునా?"

యువ—తెలియును అందొక్కఁడీ యింటనొకవత్సరమునుండి నివసించుచున్నాఁడు. రెండవవాఁడెవ్వరో నే నెఱుంగను.

గిరి—ఆతనిపేరేమి? ఇప్పుడాతని కుటుంబ మంతయు నెక్కడున్నది?

యువ—ఆతనిపేరు భవానీసింగు ఆతఁడు తన యొక వృద్ధమాతను యిచ్చట కాపురముండిరి ఆతఁడు చనిపోయిన పిమ్మట నామెయిచ్చటినో వెడలిపోయినది.

గిరి—ఆమె తనతో సామానంతయును గొనిపోయినదా? లేక నయ్యది యింకను నిచ్చటనేయున్నదా?

యువ—ఆమె యొక్కతియే వెడలిపోయినది.

గిరి—ఒకసారి యాత్రని పెట్టెలు మున్నగునవి శోధింపవలసియున్నది

యువ—ఆమె తాళముచెవి చికొని పోయినదిగదా?

గిరి—కానండు. ఆతాళముపై నేను సెలువై చెవను. రేవు తగుబుసాజు మొకుటనే యాగది శోధింతము

అనుచు తానెవ్వరేనది యుం నెందులకరుదెంచి నదియు తాసాతని పెట్టెలో నాతని యుంపుడుకత్తె నామనుగాని—ఘాటూపటనుగాను లభించునేమోయని శోధింపవలసియున్న దనియును జెప్పెను యువకుండంటాల కంగీకరించెను గిరిధరుండా యింటికి పరాకబిగము వైచి యుద్దానిపై సెలునైచి యువయమువలెనును నెవ్వరువచ్చినను దలుపు తెరచుటకు వీలులేదని జెప్పుడని బల్కి యూతనికడ సెలవుదీసుకొని వెడలి పోయెను.

* * * * *

గిరిధరిలాలు మరునాడు కేశవలాలును వెంటనిడుకొని వచ్చి యారియుప్రయుత్తు యిసగు పొరుగున నున్నమనుజుల ముగ్గురను బిలిపించి వారియెదుట నాగది తాళముల దీసిరి. గిరిధరుండు ప్రతివస్తువును జాగరూకతతో పరిశీలించుచుండెను. ఆగదియందు నాలుగైదు పెట్టెలును, వంటసామగ్రియు గలవు; ఆపెట్టెల నొక్కొకదానిని దెరచిరి. ఒక పెట్టెలో కొన్నిబట్టలుండెను. ఒక పెట్టెలో నాహారపదార్థ

ములున్నవి. మూడవపెట్టెను దెరచిరి. అందేనో గొన్ని పుస్తకములును కాగితములు నుండెను. గిరిధరుఁ డాకాగితముల నన్నిటిని పరిశీలించెను కాని యందాతని కుపయోగించు పత్రి మొక్కటియు లభింపకయ్యెను. నాల్గవపెట్టెను దెరచిరి. అందు విలువయైన నగనములును, రెండు వెండిగిన్నెలును యున్నవి-ఆగిన్నెలపై విలాసములను గిరిధరుఁడు పరిశీలించెను. కాని యవియు నాతని కేమియు నుపకరింపలేదు. ఒకదానిపై యాగిన్నెను తయారుచేసిన కంపెనీపే రున్నది. రెండవదానిపై "భవానీసింగు" యని పేరుండెను. అందలివస్త్రములన్నియు నీవలకుదీసి చూచిరి. అడుగుభాగమున నొకటిరెండు కాగితపు పీలిక లున్నవి. గిరిధరుఁ డొకపీలిక నందుకొని యొకదానిని విప్పి యిట్లు చదివికొనెను.

"నీవు దూరమున నుండుటచే నీదర్శనమగుటయే కష్టముగానున్నది. కావున మావీధికి నీవు నమూన్చికొనుము. అట్లొనరించినయెడల నీవెల్లపుడును నాయింటనున్నట్లే దలంచెదను. కాదందువా! నేనే క్రీడపూరున కరుదెంచెదను. తగిన యిల్లొకటి యద్దెకుమాటలాడి యుంచుము. నీపైగల మోహామును విడువజాలను. నినుబాసి నిలువజాలను...... ..." కొన్నియక్కరములు స్వల్పముగా నుండుటచే గిరిధరుఁ డుత్తరముయొక్క తుదిభాగమునుగూడ చదువుకొనెను. "త్వరలో నీసమీపమున నొకటిరెండు గృహములలో నీకద్దెకు గదులు లభింపగలవు.

అద్దె యెక్కడయగునని యాలోచింపవలదు సాయంకాలము ముఖ స్తముగా నెల్లవారగలను మాటలాడగలను." అయుత్త రమునకు చేవ్రాలుగాని తేదీగాని లేదు. రెండవకాగితమును దీసెను. అదియొక బిల్లుకాగితము అందునను భవానిసింగు నామమే యున్నది. కాన దస్ర్తమాసమును సర్వస్వమొసదని యాతడు చింతింపి యూగదితలుపుల నెప్పటి తె మూయించెను.

భవానిసింగు మందిరమును పరిశోధించుటవలన నాతని యింపుడుకత్తెగూడ లోకుగ్ రెట్స్పాను రోడ్డునే యుండ వచ్చుననుట స్పష్టమయ్యెను. కాని గావీధి యందు పెక్కురు గణికాంగనలుండుటచేగా నాయకురా లెవ్వతెయో గుర్తిం చుట మిక్కిలి కష్టమనియు, యింకను గొన్నియాధారములు లభించినగాని కార్యము సాధింపబడదనియు దలంచి గిరిధరుడు హంతకుని చరిత్రమునుగూడ నామూలాగ్రముగా నెఱుంగు టకు సంకల్పించుకొనియెను. ' ఆతని ఫోటో నొసంగియున్నను పోలీసు లాతనియునికి యెక్కడనో తెలియజాలకుండిరి. ఇంక నీతనిచారిత్ర మెట్లెరుంగనగునాయని యాలోచించుచుండెను. ఇంతలో నాతని కానాడు భవానిసింగునింటినుండి వెడలిపోయిన ముసలి తిరుగవచ్చిన కొంతయుపకారిగా నుండునని దలంచి టెల్లిఫోనులో తాను తొలుత 1978/5 గృహమున గాంచి మాటలాడినయువతుని బిలచెను. అతనితో నిట్లుసంభాషించెను.

"ఆముదుగలి సామానుకొఱకై తిరుగవచ్చినదా?"

'మాంచిది. వచ్చినతోడనే నాకు వర్తమానమంపుడు."

"రానియెడల నామెయునికి దెలిపి సామాను బంవు మనిన గూడ నాకెఱింగిపుడు."

ఇట్లాతఁడు మాటలాడుచుండగా కేశవలాలు లోనికరు దెంచెను. గిరిధరుఁడాతని నొకయాసనముపై గూర్చుండవల సినదనిజెప్పి ఫోనులో నాయుమకున కిట్లనియెను. "నీ వీవిషయ మున జాగరూకత వహింపవలెను మరచెదవుసుమా!" యని హెచ్చరించి కేశవలాలును సమీపించెను.

---

నాల్గవ ప్రకరణము.

---

మరియొక హత్యయా?

గిరిధరుఁడును కేశవలాలును యిట్లు సంభాషించుకొనిరి.

"ఫోటో చాలవఱ కుపయోగించినది."

"ఎట్లు?"

"ఆవీధినున్న వేశ్యలయిండ్లకు దరుదెంచు విటులకీఫోటో నుజూపి యీతని నెఱుంగుదువా యని యొకనిని ప్రశ్నించితిని.

పలువురు తా మాతని నెఱుంగమనిరి. కాని యొక్కరుఁడు మాత్రము వాని నెఱుంగుదుననియు అతని నివాస మాలీపూరనియు జెప్పియుండెను. ఆలీపూరు నెడలి యందు వాకబు చేసితిని.''

''లాభించినదా?''

''లేదు.''

''అట్లు జరుగునని నేనును దలంచితిని.''

''ఎందువలన?''

''ఎవ్వరును యెరుగని యూరిని నాతఁడుమాత్ర మెరిగి యుండునా? ఒకానొక వేళ నెఱిగియున్నను, యూతఁ డాతని యెప్పుడుకట్టైనకూడ నెరింగియుండును. మీతో నెవ్వరీసంగతి దెల్పిరో వాడైనన గుర్తింపగలరా? ఆతని యునికి దెలియునా?''

''ఆతనిని గుర్తింపగలను. కాని యాతఁడెచ్చట నెక్కడనుండునో దెలియదు''

''ఇప్పుడైన దెలిసినదా! వాడెవ్వఁడో మిమ్ము వంచింపుటకట్లు జేసెను. ఆలోచింపగా నీహంతకునకు, బంధువైన నీతఁడు మావాడనిగాని, యాతని పోలిన తెలియునిమెడల మావాడొకడు తప్పిపోయియుండెనని గాని దెలుపువారు లేరైరి. ఇదియన్నిటికంటె చిత్రముగానున్నది. నాకింకొకయనుమానముకూడ గలదు. ఎవ్వరైనొకట్టి మహమన్నొపించు

చుంటిమో యామె ఫలాయనసూత్రమును పఠించునని దోచుచున్నది.'

'ఇంకేదిమార్గము?''

"ఒకటే మార్గమగపడుచున్నది. ఆమార్గము ననుసరించుటకు నేనే బూనుకొనవలయునని యున్నది. నేటిరేపట నేనొక కపటనాటకమూడ వలసియున్నది. తమరుగూడ నొకపాత్రధారణమొనర్చి నాకు దోడ్పడవలయును.'

'నాసహాయుడా! ఏవిషయమున?''

'చెప్పెద నంతవఱకు కానిండు'

'ఇంక నిప్పుడు చేయవలసిన దేమున్నది?'

"1978-5 యింట నొకయుత్తరము దొరికినసంగతి మీకు జ్ఞాపకముండవచ్చును. ఆయుత్తరము పార్వతీశః యొక వత్సరమునకుం బూర్వము వ్రాయబడి యుండునని దోచుచున్నది. అందలి వాక్యములలో నొకవాక్యము మాత్రమే మనకనుకూలించునదిగా నున్నది. ఆవాక్యమును మరల జదివెద నాకర్ణింపుడు. అందువలన మీకేమేని దోచునేమో యాలోచింపుడు! 'నీవు మావీధికి రాకున్న యెడల నేనే క్రీడ పూరువచ్చెదను తగినయిల్లొకటి మాటలాడుము. అంతియే గాని నిన్ను విడచియుండజాలను నిన్నువిడచి నిలువజాలను' ఈవాక్యము లెట్టియర్థమును స్ఫురింపజేయుచున్నవి. బాగుగా నాలోచింపుడు.'

"ఆతఁడామెవలపులమగఁడనియు యాతని ననుక్షణ మును దర్శించుటకామె యుబలాటపడుచుండుననియు దెలియు చున్నది."

'ఇంతమాత్రమేనా? ఆమెయొక యద్దెయింట నివసించుచున్నదనుట తెలియుటలేదా? వలపధికముగా నున్నయెడ వానినేదోవిధమున దనకొంపకు జేర్చుకొనును. అద్దెకొంపలో నుండుటచేతనే యిచ్చటగాకున్న నొండొకచోట నుండవచ్చునని భావించియుండును.'

"అవునవును."

'కాన నిప్పుడు లోయరుచిట్పూరురోడ్డున 1978/5 సమీపముననున్న గృహములలో నొకగృహమున నామెనివసించియుండుననుట నిశ్చయము. కావున యాపరిసరమునవద్దె కుగొని నివసించుచుండు గణికలలో గొందరి నామములైన గనుగొనవలయును. ఈమాత్రము సహాయమిప్పుడొనరించిన యనంతరము జేయవలసిన నాటకముయొక్క కథావిధానమును గూర్చి విచారింతము.'

కేశవలాలందుల కంగీకరించి మరునాడె యకార్యము ను సాధించుకొని వత్తుననియెను. ఇరువురును కొంతకాలము వినోదముగాముచ్చటించుకొని సాయంకాలమయినతోడనేక్లబ్బున కేగిరి.

*    *    *    *    *

ఒకదివ్యసౌధమునందొక యువకుఁడు కూర్చుండియుండెను. ఆతని యవయవము లతిసున్నితములై శరీరచ్ఛాయ నిట్టిదని బాగుగ దెలుపుచున్నవి. ఆతనిబొడగాంచినవా డు, స్వర్ణవిగ్రహ మని దలంతురుగాని నిక్కంపుమానిసిగాఁ దలంపరు. ఆతని ముఖంబున చిఱునవ్వు తాండవమాడుచుండెను ఆతనిపార్శ్వమున నొక్కయువతీమణి సాక్షాత్కరించిన రతీదేవియో యన వెలుంగుచుండెను. ఆమెయు దరహాసాంచితయై తమ్ములమును దయారు చేయుచుండెను.

ఆతఁడామె చుబుకము బట్టి ముద్దులాడుచు "నేటికి నీ యట్టి సుందరీమణి సునాయాసముగా లభించుట నాభాగ్యమనియే దలంపవలయునుగదా?" యని బల్కెను.

"ఒక్కనాటికే సంతుష్టి జెందుచుంటి రే."

"పురుషు లల్పమునకే సంతోషింతురు."

"అనగా నేమో?"

"ఆసంగతి నేనెట్లు జెప్పగలను."

"సరసులకు దెలియకుండునా?"

"తెలిసికొనుటకుఁ దగిన యవకాశము లభింపనే లేదు గదా! ఇంక దెలిసికొన యత్నించెదను."

"ఇంతమాత్రమైన ననుగ్రహమును నాపైనుంచితి రదియే పదివేలు."

"నీపై సంపూర్ణమగు ననుగ్రహ ముంపవలయుననియే నాయభిప్రాయమని జెప్పియుంటినిగాదా?"

"నేనుమాత్రమో! వలదంటినా? మీయిచ్చవచ్చినట్లు దిద్దుకొనుమంటినిగదా?"

"కట్టుబాట్లకులోనై యుందునని బాసయిచ్చెదవా?"

"ఇంతకంటె వేరుచోటనేమి బాముకొనగలను?"

"మొన్న పేపర్లలోఁ బడినసంగతులన్నియు వింటివిగదా! అట్టియొక నమ్మిక గుదురుట దుర్ఘటముగాదా?"

"ఎవ్వరో జాతితక్కువముండ యేదో జేసినదని యెల్లరును యుక్తి చేయుదురా?"

"ఎంతవిచిత్రముగా దానితప్పించుకొనిపోయినదో! మువ్వురను బూడిలోఁ గలిపినది."

"ఆతప్పించుకొనుటచే గిరిధరుఁడును పత్తేదారుబాబామెను బట్టుకొనుటకై విశ్వప్రయత్నములు జేయుచున్నారు. నేడో రేపో దానిపాపము పండకపోదు."

"ఈసంగతి నిక్కమేనా? పేపర్లలో నానిషయమేమియు వ్రాయబడియుండలేదే? నీకెట్లీసంగతి దెలిసినది?"

"నాకేగాదు. ఈవీధినున్నవారెల్లరకునుగూడ దెలియును. ఆవిచారణదినమున నిచ్చటివారనేకులు న్యాయస్థానమున నుండిరి."

"ఆమె మీస్నేహితురాలె యనుకొందును."

'ఏమనుచుంటిరి. ఆమె నా సేహితురాలా! మీ కెవ్వరు జెప్పిరి?"

'ఎవ్వరును జెప్పియుండ లేదు. నేను యూరకయనుగు చుంటిని. ఒక వీధనున్న వారగుటచే నట్లుగిగితిని.'

"ఆమెయు నీవీధనేయున్నారా?"

"నీవామెను జూచియైననుండ లేదా ? ఆమె పేరైనవిని యుంటివా?'

'అంతటినోము నోచుకొన లేదు. లేకున్ననీపాటి కాగిరి ధరలాలుగారికి సంగతి నెటింగించియే యుందును."

"అట్టి యుద్దేశమే యున్నయెడల నప్పుడ దెలిసికొన గలవు'

"ఎట్లు?'

'ఆమెనుజూడకున్న మానె, నామెకొఱకువచ్చువారినైన నెటిగియుందువు.'

"నేనెవ్వరిని యెరుంగను. అప్పటిలో నేను గ్రామాంతర మునసుంటిని. కాని యామెవిటులెస్వరో గుర్తించుట నాకెట్లు వీలగును."

'పోనిమ్మి, వారిగొడవ మనకేల?'

యనుచు నామెయొసగుతమ్ములము గైకొని రాత్రిసుమా రెనిమిదిగంటలకు దిరుగవచ్చెదను; బజారునకేగెదను. అనుచు

లేచినిలువబడెను ఆమెయు నాతని నాలింగనమొనర్చి త్వరలో రావలసినదని బల్కుచు నాతని సాగనంపెను

అతఁడెవ్వరోయని పాఠకమహాశయులు కొందఱుందు రేమో? అతఁడు గిరిధరుఁడని వేరుగఁ జెప్పవలసిన పని లేదు అతఁడీవిధముగా నొకరిద్దరిని కలిసి చూచిన యెడల, నామె నివాసము దెలియవచ్చునని తలంచెను. నాఁడాతనికా వారాంగనతో జరిగిన సంభాషణమున నించుకంతయు లాభము గలిగియుండదని పాఠకలోకమునకు దెల్లము కేశవలాలును గూడ నిట్లే సంభాషింప నింకొక యింటికి బంపియుండెను.

రాత్రి సుమారేడుగంటలకు గిరిధరుఁడు కేశవలాలును గలసికొనియెను. అతఁడిట్లు తనవిచారణచర్యయొక్క ఫలితమును జెప్పియుండెను. "నేనేగియుండిన గృహమున నిరువురు వారాంగనలుగలరు వారిలో నొక్కతె చిరకాలమునుండి యా యింటనే నివసించుచున్నది పెనకనొకసారి యామెయింట నెవ్వరో కొన్నినగలు చోరీపోయి లభించియుండెను. కాని యవి యామె పెట్టెయందుగాక, యామెకొఱకై చనుదెంచినవాని పెట్టెలో నుండుటచే నామె శిక్ష లేకుండ దాటినది. నాటిమొదలు నేటివఱకామె పోలీసులయెడ కడుంగడు భయముగలది. కావున నామె చెంతకే నేనుపోయి, యా రెండవ యామెను గూర్చి వాకబుచేసితిని. ఆమెయు సత్ప్రవర్తనము గలదనియును, ఆమె యెవ్వరినో యొక్కనినే నమ్ముకొని కాలయాపనము చేయు

చున్నదనియు జెప్పెను. తదుపరి యీహత్యలకు కారకురాలైన స్త్రీ యెచ్చటనుండెనో యెఱుంగుదువా యని ప్రశ్నించితిని. ఆమెసంగతి తానేమియు నెఱుగనని జెప్పెను. తదుపరి నేను హంతకుని ఛాయాపటమును జూపి యీతని నెప్పుడైన జూచితివాయని ప్రశ్నించితిని. ఆమె యాపటమును పరిశీలించి చూచి—ఈతని నొకటి రెండుసార్లు మాత్రమే జూచియుంటిని. 1978/5 యింటనున్న యెవ్వనికొరకో యీతఁడు వచ్చుచుండెను కాని యీతఁ డెవ్వఁడో నాకు దెలియదు వారము పది దినములనుండి యీతనిజాడయే గాన్పించకున్నదని యుత్తరు వొసంగెను అంత నేనూరకుండ 1978_5 గృహమున కాతఁడు గాక యింకెవ్వరైన తరచు వచ్చెడువారా? యని ప్రశ్నించితిని. ఆమె యందులకు దన కావిషయము దెలియదని యుత్తర మిచ్చెను. ఆలోచింపగా నామె కింతకంటె నెక్కుడుగా దెలియదని దోచుచున్నది మీ రేగిన చోట నేమేని విశేషము లున్నవా యని ప్రశ్నించెను. గిరిధరుడును చిఱునవ్వున "సమాంతఫలిత మునే పొందితిమి. కాని నాకొక యనుమాన మున్నది. హంతకుని వాక్యములలో నామె నారాంగనయని జెప్పియుండెను. కాని యాపలుకులసత్య మెంతయుండునను ననుమాన మిప్పుడుదయించుచున్నది. రేపటిదినంబున నిట్లే మరియొకచోట గూడ నీనాటకమునే ప్రదర్శింతము. అప్పటికిని యాచోకీ దారకని యెడల నింకొకమార్గ మనుసరింతము. ఆవిషయ మటుం

చుడు. మీతో హంతకుడు శ్రీడపూరులో నివసించుచుండునని దెల్పిన యాతండైన మీకు గాన్పించియుండెనా?'

"లేదు. ఆతనికొఱకై యత్నించిన దేదీ! రెండురోజుల నుండియు వేరొకవిషయమునుగూర్చి యాలోచించుచుంటిమి గదా?"

"రేపటిదినంబుననైన ప్రయత్నము సేయుదు"

"మీరాతనికిందు సంబంధముండి యుండునని భావించు చుంటిరా?"

"లేదు. కాని యాతఁడు మీతో సత్యమేల జెప్పియుండెనో యెఱుంగవలదా?"

"ఆతఁడు సామాన్యముగా గాన్పించునా? ఆతనికొఱ కొకటి రెండుదినములైన యత్నింపవలయును."

"కానిండు. ఈలోపునవచ్చిన కొందరయేమున్నది నాఁడే మీరాతని నివాసమును దెలిసికొనియున్న నిప్పు డింతగా శ్రమజెందవలసిన పనియుండదుగదా?"

"ఏమిచేయుదును. ఆతఁ డేదోపనికై త్వరితముగా నేగుచుండెను. నిలిపి మాట్లాడుటకైన వీలుచిక్కినదిగాదు. ఈమారాతఁడు గాన్పించియున్న నాతని నివాసమును దెలిసి కొనుటయేగాక యాతనిప్రవర్తన మెట్టిదో గూడ దెప్పక గను గొందును."

నాచీని, కాగితములను కేశవలాలు జాబితా వ్రాసి పలువురిచే సంతకములు చేయించి జాగ్రత్తపరచెను. గిరిధరుడు మణిభూషణుని బిలచి 'యీయింటియజమాని యెచ్చటికో వెడలిపోయినది. ఈగృహమును విడిచి వదలిపోవుట మంచిదిగాదు. ఇందింకను విలువయైన సామానులు గనబడుచున్నవి. దీనిని నీవు జాగ్రత్తగా జూచుచుండుటకు సమ్మతించెదవా?" యని ప్రశ్నించెను. "అయ్యా అట్టి పని మాపై బెట్టకుడు. సదా యీగృహమును కావలిగాయుట కెవ్వనికి దీక" యని యాతడు ప్రత్యుత్తర మిచ్చెను. అంతట గిరిధరుడు కేశవలాలునుజూచి "యీయింట గలవస్తువులన్నియు జాగ్రత్తపరుప వలసియున్నది. ఇంతేగాక యీహత్యకు సంబంధించిన కాగితములు గాని, వస్తువులు గాని కొన్ని లభించిన లభింపవచ్చును. ఈయింటినుండి వెడలిపోయిన తరుణీమణి యెవ్వరో, యెందుల కిట్లు వెడలిపోయినదో దెలియుట కివకాశము గాన్పించుట లేదు. కావున యీగృహమునకు తాళమువైచి సీలుచేసి నీవు త్వరితముగా నాసుపత్రికిబోయి యాశవమునకు పోటోదీయించుము" అని బల్కెను

కేశవలాలు అప్పటికే 12 గంట లగుటచే గిరిధరుడు యాగృహపరిశోధనమున కింకను జాప్యముచేయునేమో యని త్వరితముగా తలుపులన్నియు బంధించి వీధికవాటమునకు దాళము వైచి సీలుచేసి యిరువురు రక్షకభటుల నటకాపుంచి గిరి

పోలీసుఠాణాకు బంపితిమి. ఇంతలో ననుకొననియట్లు తమరరు దెంచిరి.

గిరి—ఈ లేఖలవలన గంగారాం మీ మొదటి భార్యకాడనుట తెల్లమగుచున్నది. కానిండు, గంగారాముగాని లీలాగాని మీకు గాన్పించిన వారిని గుర్తింపగలరా? మాకునీయింటివారి పొటోలైన దొరకినవికావు.

మణి—గుర్తింపగలను.

గిరిధరుఁ డా లేఖలోని యంశములనుదననోటుబుక్కులో నోటుజేసికొనుటకై నోటుబుక్కునుదీసి మాటలాడుచు పుస్తకమును తల్లక్రిందులుగా బట్టుకొనియెను. అందుండి రెండుపొటోలు క్రిందబడియెను. మణిభూషణుఁడా పొటోలు రెంటిని పైకెత్తిజూచి "యిదే గంగారాముపొటో దొరకలేదంటిరే" యనిబల్కెను. గిరిధరుఁడాశ్చర్యమగ్నుఁడయ్యెను. 'ఏమీ యీ పటమా! గంగారామునిదా! బాగాగుర్తించితిరా?' యని యాతురతతో గిరిధరుఁడు ప్రశ్నించెను.

మణి—సందేహము లేదు. ఆతనిదే యీపటము. నేను నిశ్చయముగా వచింపగలను.

గిరి—ఈచిత్రపట మాతనిదేయైనయెడల లీలయాతని భార్యగాజాలదు. ఈవిషయ మీాతనిమరణవాఙ్మూలమే ధృఢీకరించుచున్నది. ఈమెయొక నారాంగనయని యాతఁడు జెప్పియున్నాఁడు,

మణి—ఆతఁడు మరణించియుండెనా? ఎప్పుడు?

గిరిధ—ఒకమాసమునకు పైగా! ఆతఁడు మరణించిన సంగతి నెఱింగియు, నాతనినితరులెవ్వరును యెఱుంగమి లీల యాతడు గ్రామాంతరమేగియుండెనని యిరుగుపొరుగు వార లకు జెప్పియుండెను. అందువలన మీారయ్యది సత్యమనియే నమ్మియుందురు.

కేశ—మనకు గంగారాముని పేర వ్రాయబడిన లేఖలు నాలుగైదులభించినవిగదా! అయ్యవి యీామెచేతనే వ్రాయ బడియుండునా?

గిరి—ఇంకనుసందేహమెందులకు. ఈమెతొలుత నొ క్కనియధీనములోననో యుండెను అపుడీమె గంగారాముని ప్రేమించియో లేక తన్నాదరించు నాతనియెడగల్గు విరక్తిచేత నో యీాతనికి లేఖనువ్రాసి యెట్లో యాతనిమోహగించి ఈ గంగారాముతో నరుదెంచియుండెను. మణిభూషణా! ఈగంగా రాముని కేమైన పనియున్నదా?

మణి—ఎక్కడనో పనిచేయుచుండెనని యెఱలంతును.

కేశవ—మధ్య భవానిసింగు సంబంధమెట్లుగలెను.?

గిరి—గంగారామునికాతఁడు స్నేహితుఁడు. ఇంతియె గాక యాతఁడు సుందరుఁడు. లీల యాతనిజూచి ప్రేమించి యుండును. కాకున్న యెడల నాతఁడే యీామెను దనవలలో దగుల్కొన చేసియుండును. ఇందువిపరీతమేమున్నది!

కేశ—మనోహర సేనుని సంబంధమా!

గిరి—మనోహర సేనుఁ డామెరూపముగాంచి ముగ్ధుఁడై యామె నెట్లో కలసికొని యుండవలయును. ఆమెకు ధనాశ గొల్పి లోబరచుకొని యుండవలయును.

కేశ—మనోహర సేనునితో సంబంధము కల్గియున్నట్లు దెలిసియు గంగారాముడీమెయెడ మక్కువకల్గి యుండునా?

గిరి—ఆమెనుగూడ దండించియే యుండును. గాని యామె తరుణీమణియగుటచేతను యామెపైగల మోహమీ తనికి దరుగకుండుటచేతను యామె నేమియు జేయజాలకయే యాతఁడు మనోహర సేనునితో నొకటిరెండుసార్లు మాగృహమునకు రావలదని జెప్పియుండెను. అప్పటికిని యాతఁడు మానకుండుటచే నాతని వధించెను.

కేశ—తన కాంత పెరవానితో బోవుచుండ నామె నేమియు జేయజాలక యాతని వధించుట కేదో కారణముండి యుండును.

గిరి—ఉండియుండును. గాని యాతఁడు తనచారిత్రము సర్వమును చెప్పకుండ మరణించుటచే నట్లు నిర్ధారణ చేయుటకును వీలులేకున్నది.

మణి—ఇదంతయును గందరగోళముగా నున్నది.

గిరి—మణిభూషణా! నీకిప్పుడేమియు దెలియదు. వీలనుగూడ బట్టుగొనినపిమ్మట సర్వమును నీకు చెప్పెదను. గాని

నీవు మాకొకసహాయము చేయవలయును. అదేమందువా? మే మామెనొక్కమారైన జూడకుండుటచే నామెనుజూచియు గుర్తింపజాలము. మాకనుమానముగానున్నతరుణీమణిని నీకు జూపిన నామెను గుర్తింపవలయును ఇంతియేగాక యామె నీ యూరనెక్కడనైన నున్నదేమో పరికింపవలసిన భారమును గూడ నీవు వహింపవలయును.

మణి—నాశక్తివంచనలేకుండ యత్నించెదను.

అనంతరము గిరిధరుడును కేశవలాలును యాగృహము నకు దాళము వేసి మరల సీలుజేసి వెడలిపోయిరి… … …

గిరిధరుడు కేశవలాలుతో పోలీసుఠాణా కరిగినాడు. లీలాగృహమున హత్యచేయబడిన యాతనియొద్ద దొరకిన కాగితములను వస్తువులను పరిశీలించుటకరిగెను. కేశవలాలా వస్తువులన్నిటిని దెచ్చి యాతనిముం దుంచెను. గిరిధరుడొక్కొక వస్తువునే పరిశీలించుచు యజమానుని గుణప్రవర్తనము లిట్లుండు నని వచించుచుండెను.

"ఈవాచీని బరికించినయెడల నాతడతిజాగరూకతగల వాడనియు, నతిజాగరూకతతో వస్తువులను వాడుచుండు ననుటయు స్పష్టమగుచున్నది. మరియు నియ్యది మిక్కిలి విలువగలది యగుటచేత నాతడు ధనికుడగుట విదితముచే యుచున్నది. కాని యాతని దుస్తులు విలువగలవి కాకపోవు టచే నాతడించుక లోభగుణముగలవాడుగా దోచుచున్నది."

అని యాగడియారము వచ్చుటనుంచి యుండలికాగితములలో నొకటిరెండు పరికించెను. వానియందు దాతనికి వచ్చిన యొక యుత్తరముగలదు. ఆయుత్తర మీకింది చిరునామాకొక బంధువునిచే వ్రాయబడియున్నది.

"రామానందచటర్జి"

1565—5 నం. అలహాబాదు."

గిరిధరుఁడు కేశవలాలుతో "అయ్యా! ఈతఁడీయూరు వాడుగాడు. అలహాబాదునివాసియని దోచుచున్నది. కావున నివిలాసమునకు యీతని బంధువులెవ్వరైన నున్నయెడల రావలసినదని టెల్లిగ్రాము పంపుటమంచిది.''యని బల్కెను. కేశవలాలు మంచిదని బల్కి టెల్లిగ్రాము వ్రాసి యొకరక్షకభటుని చేతికిచ్చి పంపెను. గిరిధరుఁడాయుత్తరమును వెనుకకుద్రిప్పి చూచెను అది కలకత్తానుండి వ్రాయబడియుండెను. ఆయుత్తర మెవ్వరు వ్రాసియుండిరో దనపుస్తకమున నోటుజేసికొని గిరిధరుఁడు మిగిలినవస్తువులను కాగితములను పరిశీలించెను. అందేమియు గమనింపదగినవిషయములు లేకుండుటచే వానిని కేశవసేనున కందించి "మహాశయా! నేటికి హత్యచేయబడిన కడపటిముగ్వురిలో నొక్కనిచారిత్రముమాత్రమే యెఱుంగుటకవకాశములు గలుగుచున్నవి. ఇందువలన మన మన్వేషించు తరుణీమణిని బట్టుకొనుట కనువైనమార్గములు లభించునేమో యనునసుమాన ముదయించుచున్నది. ఇదిగో చూచితిరా! ఈ

యుత్తర మీగ్రామమునుండి వ్రాయబడియుండెను ఈలేఖ వ్రాసినయాతని గలసికొన్న యెడల మన కీతనిచారిత్రము కొంత వఱకు దెలియగలదు నేనిప్పుడే యాతని గలసికొని మాటలాడి వచ్చెదను'' అనుచు లేచి తనమోటారుసైకిలుపై కాళీఘట్ట మున కరిగెను

గిరిధరుఁడొక గృహములోనికరిగి చావడిలో నున్న యొక బాలునిబిలచి 'అబ్బాయీ! విశ్వేశ్వరచటర్జీగా రింట నున్నారా' యని ప్రశ్నించెను. ఉన్నారని బల్కుచు నాబాలుడు లోనికేగి చటర్జీగారిని దోడ్కొనివచ్చెను.

గిరిధరుఁ డాతనికి నమస్కరించి "అయ్యా! తమతో కొన్నివిషయములు మాటలాడవలసియున్నవి. సమయమీయ గోరెదను. అంత చటర్జీగా రభ్యంతరమేమి? రండు కూరుచుండి సావకాశముగా మాటలాడుకొందము'' అనిబల్కి గిరిధరున కొకయాసనము జూపి తానొకయాసనమున గూర్చుండెను. వా రిరువురును యిట్లు సంభాషింప నారంభించిరి.

గిరి—అయ్యా! నాలుగైదుదినముల క్రిందట తమగృహమునకు రామానందచటర్జీ యనువారలు వచ్చియుండిరిగదా?

చట—అవును. వచ్చియుండిరి నాలుగైదుదినముల క్రిందటనే యిచ్చటినుండి వెడలిపోయియుండిరి.

గిరి—వారు వెడలిపోవునప్పుడు మీతో జెప్పియే వెడలిరా?

చట—ఆతఁ డీగ్రామమున కరుదెంచి సుమారు 15 దినములు గానచ్చును. నచ్చిన పదిపండ్రెండు దినములవఱ కుల్లాసముగనే యుండెనుగాని యనంతరముమాత్రి మాతఁడేల కో యలహాబాదున కేగుటకై యాత్రత పడుచుండెడువాఁడు. మేమాతనిని యింకొక కొన్నిదినములుండవలసినదని ప్రార్థించితిమి. ఆతఁ డుండుటకు వీలులేదని బల్కెను. ఒకనాడు వాడుక చొప్పున నాతఁడు సాయంకాల మైదుగంటలకిల్లు విడచి వెళ్లి యుండెను. కాని నాడాతడు తిరిగిరాలేదు. మరునాడును యాతనిజాడయు గాన్పించదయ్యెను. అందుచే నాతడు వెడలి పోయియుండునని మేము భావించితిమి. ఏమీ మీరాతనిగూర్చి యిట్లు ప్రశ్నించుచుంటిరి?

గిరి—మీకాతఁడు బాంధవుఁడా?

చట—కాడు స్నేహితుఁడు—మీరెందులకాతనిగూర్చి ప్రశ్నింపుచుంటిరో దెలిపెదరా.

గిరి—అయ్యో! ఏమనిజెప్పుదును. ఆతఁ డీనగరమున హత్యగావింపబడినాడు.

చట—ఎప్పుడు! ఎక్కడ! హత్యచేసినవా రెవ్వరు! హరిహరీ! యెంతమాటవినవలసివచ్చెను

గిరి—ఆతని శవమును నాలుగురోజులక్రిందట మేము గాంచియుంటిమి అప్పటినుండియు దర్యాప్తుచేయుచుంటిని.

చట — కష్టా! ఎంతటిదారుణము జరిగిపోయినది? అయ్యో! ఆతఁ డెందులకై హత్యజేయఁబడియుండెనో దెలియ వచ్చినదా?

గి — లేదు ఆతనిశవము మాకుగాన్పించిన యింటి యందు దొరయనతఁ నివసించెడిది. కాని నాటినుండియు నాస్త్రీ గాన్పించుట లేదు.

చట — ఏమీ! యాతఁ డట్టిదురభ్యాసముగలవాఁడా?

గిరి — మీరాతని ప్రవర్తనమునుగూర్చి యేమైన దెలుప గలరను నాశతో నరుదెంచితిని.

చట — మీవలన వినినమాటవలననే యాతండీదురభ్యాసముగలవాడని తెలిసికొంటిని. ఇంతకుమున్నెప్పుడును దుష్ప్రవర్తనమున కలవాటుపడినవాడని వినియుండలేదు. వినుటకవకాశమైనను గలుగలేదు.

గిరి — ఈతనికి బంధువులెవరైన నున్నారా?

చట — లేకేమి.

గిరి — వారెవ్వరు. ఎచ్చటనున్నారు.

చట — ఇరువురు కుమారులు. వారలహాదులోనే యున్నారు.

గిరి — ఈతనిస్థితిగతులనుగూర్చి మీరేమైనఁజెప్పగలరా?

చట—మంచియూస్పిపరుడు పరమలోభి. రెండేండ్ల నుండి యుత్తరములు వ్రాయగా వ్రాయగా నిప్పుడరుదెంచి నాడు. మృత్యువాతనిని ట్టీడ్చుకొని వచ్చినది గావలయును. కానిండు. ఆతనిశవమింకను భద్రపఱుపబడియున్నదా? లేక దహనపరచిరా?

గిరి—మొన్ననే దహనపరచిరి.

చట—నాదే కడసారముగాబోలును. మంచిస్నేహపాత్రుడు.

గిరి—అడుగమరచితిని. ఆతడు వచ్చినపుడేమైన సామానుగొనివచ్చెనా ?

చట—పెట్టెదెచ్చిన కూలిమనుష్యులకు కూలి యివ్వవలసివచ్చుననియు, బండ్లకుబోయువలసి వచ్చుననియు నాతడు సామానేమియును గొనిరాలేదు.

గిరి—అంతటిలోభియా?

చట—రైలుఖర్చులకు సొమ్ము వ్యయింపవలసియుండు నని యెన్నడును యిల్లుగదలడు. కావుననే యీాతనికి వ్యభిచారమున ప్రవేశము లేదని మే మభిప్రాయపడుచుంటిమి.

గిరి—ఈయుత్తరము మీాాతనికి వ్రాసినదగునా?

చట—అగును.

గిరి—ఈ ఎడ్రసునకు టెల్లిగ్రాము పంపితిమి. కుమారులలో నెవ్వరైన నిచ్చటికరుదెంతురా?

చట—తప్పక వత్తురు. నేనుగూడ వారికిఁ దెలియఁ జేసెదను.

గిరి—వారెవ్వరైన వచ్చినయెడల తమగృహమునకే వత్తురు. అపుడు వారితో మాటలాడుట కవకాశ మిప్పింప వలయును.

చట—తప్పక—కాని నాదొక్క ప్రార్థన. ఈ కేసువిషయమున తమరుశ్రద్ధతోఁ బనిచేయుఁడు. మీకుఁదగిన పారితోషిక మిచ్చెదను.

గిరి—అయ్యా! ఈతఁ డేకాంతామణిచేత వధింపఁ బడియుండెనో యాకాంతామణిని బట్టుకొనుటకై విశేషముగా యత్నించుచుంటిమి. ఆమె యీహత్యకే కారకురాలుగాక మరి రెండుమూఁడుహత్యలకు గూడ కారకురాలై యుండునని మే మనుమానించుచున్నాము.

చట—ఆమెవలన నింకొకకొన్ని హత్యలు కావింప బడినవా?

గిరి—ఆమెచే గాదనుకొనుఁడు; ఆమెకొఱకై యిరువురు పరస్పరము వధించుకొనిరి.

చట—సుందోపసుందులకథ జ్ఞప్తికివచ్చుచున్నది.

గిరి—అట్లనే జరిగినది.

అయ్యా! దిరుగ యవసరమున్న తమదర్శనమున కరు దెంతును, ఇంకనాకు సెలవిండు. అని గిరిధరుఁడు సగౌరవ

ముగాఁ బల్కెను. చటర్జీగారాతనిని కొలదిదూరము వఱకును సాగనంపి వెనుకకు మరలిరి.

గిరిధరుఁ డాతనికడ సెలవుగైకొని గృహోన్ముఖుఁడై యరుగుచు మార్గమధ్యమున గాన్పించిన కేశవలాలునకు దానరిగివచ్చిన విషయమును గూర్చి క్లుప్తముగ నెఱింగించి బిల్లిగ్రాముచూచుకొని యలహాబాదునుండి యెవ్వరైనవచ్చు వఱకు నిరీక్షింపవలసియున్నదని జెప్పెను.

*    *    *    *    *

హత్యజరిగి 5 దినములు గావచ్చినది. కాని హత్యయొన ర్చినలీల యెచ్చటనున్నదియుఁ దెలియదయ్యెను. గిరిధరుఁడామె ప్రతిబింబమైన సంపాదింపవలయునని ప్రయత్నించుచుండెను. గిరిధరుఁడు మణిభూషణుని వెంట నిడుకొని కలకత్తానగరమున పలువురు విలాసినులుండు ప్రదేశములకరిగి యందెందైన 'లీల' గాన్పించునేమో యని పరికించుచుండెను. ఇట్లుండ బిల్లి గ్రాము జూచుకొనిన వెంటనే బయలుదేరివచ్చిన రామానంద చటర్జీ కుమారుఁ డీశ్వరలాలు గిరిధరుని గలసికొనియెను. గిరిధరుఁడు చటర్జీగారియొక్క శవముగాన్పించిన దాదిగాగల విషయములన్నియుఁ దెల్పి మీనాయనగారిప్రవర్తన యెట్టిదని ప్రశ్నించెను. ఈశ్వరలాలాతని కిట్లనియెను. అయ్యా! మాజ నకుఁడు పరమలోభి అయినను కళత్రనష్టమైనపిమ్మట, తిరుగ వివాహము జేసికొనక, యొక వారాంగనతో సాహచర్యము

గలుగజేసికొనెను. ఆమెకు నెలకు ముప్పదిరూప్యములు మాత్రమే యొసంగువాఁడు. మాకెవ్వరికిని యీసంగతి తెలియదని యాతనియభిప్రాయము. మేము సకలమెఱింగియు నెఱుంగనట్లే ప్రవర్తించుచుండెడువారము. సుమారొక సంవత్సరము క్రిందట నతనియనురాగమునకుఁ బాత్రురాలైన యావారాంగన మఱియొకనితో వెడలిపోయెను. నాటినుండియు తలంపామె పైననే నిల్పి యెన్నఁడును యింటినుండియే కదలి బయటికైన వెడలడయ్యెను. విశ్వేశ్వరచటర్జీగారెన్నియో యుత్తరములు వ్రాయుచుండిరి. కాన వారినొక్కపరిచూచి రావలసినదని మేమే యాతనిబలవంతపెట్టి పంపితిమి. మాయుద్దేశమేమన అందువల్లనైన నీతనిచిత్తమున కొంకెంతశాంతి గలుగునని. కాని విధివిధానము వేరుగనున్నది.

గిరి—మీజనకుఁ డేవారకాంతతో సంబంధము గలిగి యుండెనో దెలియునా? ఆమెబంధువులెవ్వరైన నాయూర నుండిరా?

ఈశ్వర—ఆమెకు బంధువులెవ్వరును లేరు. ఒకముదుసలి యామెను బాల్యముననే కొనిపెంచి విద్యాబుద్ధులు చెప్పించెను. ఈమె యాముదుసలిని విడచివెడలిపోయినకొలది దినములకే యామె యావిచారమున మృతిజెందెను. ఆముదుసలికున్నయాస్తిని దాయాదులు పంచుకొనిపోయిరి.

గిరి—ఆమె పేరెవ్వరో దెలియునా?

ఈశ్వ—లీలాకుమారి.

గిరి—ఆమె ఛాయాపటమున్నదా?

ఈశ్వ—ఉన్నట్లే దోచుచున్నది. సరిగా జెప్పజాలను. నాయనగారి పెట్టెలో నుండవచ్చునని దోచుచున్నదిగాని యామె ఛాయాపటముతో నేమిపనియున్నది?

గిరి—ఆమెయే యీహత్యకు కారకురాలని మేము నూహించుచున్నాము. ఆమెను మే మింకొకసందర్భమున నన్వేషించుచుండ మీజనకునిహత్య మాకు దెలియవచ్చినది. కానిండు. గంగారాముడను నాతనిగూర్చి మీకేమైన దెలియునా? ఆతనిపేర నామె కొన్నిలేఖలు వ్రాసియున్నది. ఆతని బంధువు లెవ్వరైన నాయూరనున్నారా?

ఈశ్వర—నాకంతగా తెలియదు. గంగారాము పేరెన్నడును నేను వినియుండ లేదు.

గిరి—పొటోయున్నదియు లేనిదియు నాకెట్లు తెలియ జేయుదురు.

ఈశ్వ—నే నిరాత్రియె బయలుదేరి వెడలిపోయెదను. రేపటిసాయంకాలమునకు గాని యక్కడికేగజాలను గదా? తమకెల్లుట టెల్లిగ్రాముమూలమున తెలుపగలను.

గిరి—మంచిది. ఉన్నయెడల రిజష్టరుపోష్టులో ఆ పొటోను బంపుడు. అవసరము దీరినవెంటనే మీకు తిరుగ నద్దానిని బంపెదను.

ఈశ్వర—అట్లే చేయవచ్చును.

అనంతరము మిశ్రీలాలు గిరిధరుని చెంత ననుజ్ఞగొని వెడలిపోయెను.

---

## ఆరవ ప్రకరణము.

---

### గిరిధరలాలుని యత్నములు.

అలహాబాదునుండి లీలాకుమారి ఫొటో వచ్చినది. గిరిధరుఁడా ఛాయాపటమును మణిభూషణునకు జూపించెను. అతఁడా ఛాయాపటము లీలదే యగునని దృఢపరచెను. పటము దొరికినంతవఱకును పటమైన దొరకిన చాలునని పరితపించిన గిరిధరుఁడు పటముదొరకినపిమ్మట నేమిచేయుటకును దోపక యాలోచించుచుండెను.

ఆమె కలకత్తాలో నున్నదా? లేక తన్నెట్లును పోలీసులు వెతకిపట్టుకొందురనుభయమున గ్రామాంతరమున కరిగియుండెనా? యనుసందియము దీరక నాతఁడెక్కుడుగా నాలోచించుచుండెను. ఇట్లుండ 1978_5 గృహమునందలి యువకుఁడు గిరిధరుని ఫోనులో బిలిచెను. గిరిధరుఁడు ఫోనునకు చెవియొగ్గి వినియెను అతఁడు తక్షణమే బయలుదేరి రావలసినదని కోరియుండెను. తోడనే గిరిధరుఁడు దుస్తులను మార్చుకొని మోటారుసైకిలుపై నచ్చటికరిగెను.

గిరిధరుఁ డాయువతిని గలసికొనియెను. ఆతఁ 'డావృద్ధురాలు సామానును గైకొనిపోవుటకు వచ్చియుండెననియు మరల త్వరలోనే కలకత్తావిడువనుండె' ననియు దెల్పెను. గిరిధరుఁ డాతని కిట్లనియెను. 'ఆమెతో నొకపరి మాట్లాడుట కవకాశము గలిగింపవలసిన" దని బల్కెను. ఆతఁడు గిరిధరు నొక యాసనముపై గూర్చుండబెట్టి లోనికరిగెను. కొన్ని నిముషములలో నాతఁ డీవలికరుదెంచి "అయ్యా! ఆమె తమతో మాటలాడుట కిపుడే రానున్నది. కాని యామెకును కుమారుని ప్రవర్తనమంతయును దెలిసియుండు దని దోఁచుచున్నది '' అని బల్కెను గిరిధరుఁడు ని యామె కెంతవఱకు దెలియునో దెలిసికొందము. తనుపరి కర్తవ్యమాలోచింతము వీరిట్లు మాటలాడుచుండగనే యొకవృద్ధురా లచటికరుదెంచి కొలదిదూరమున నిలువబడెను గిరిధరుఁ డామె కిట్లనియెను "అమ్మా! నెలదినముల క్రిందట నీయింట మరణించిన భవానీసింగు మీ కేమగును?

'కుమారుఁడు'

'తమ నివాస యీగ్రామమేనా'

"కాదు. సమీపముననే యున్న యొకకుగ్రామము"

'నాటిదినమున డాక్టరుబాబును రమ్మని ఫోనుచేసినది తమ రేనా?'

"అగును"

'మేము లోనికి నచ్చినప్పు డొక సమేన జీవమున్నట్లు దోచుచున్నదని బల్కితిరే అయ్యది మీకెట్లు తెలిసినది. ఆనాడు జరిగిన వారి వాగ్వాద మేమైన మీరువినియుంటిరా?'

'లేదు. రి వాల్వరుచప్పుడు విని లోనికరుదెంచితిని. నా కుమారుడు బాకుపోటు సరిగా గుండెలకు దగులుటచేత వెంటనే మరణించెను. గుండుదగిలిన యాతఁడు కొట్టుకొనుచుండెను. అతని దురవస్థజూచి యాతఁడైన బ్రతుకునేమో యని సమీపముననే 1989_3 గృహమున డాక్టరుబాబు కలడని యెఱింగియుండుటచే ఫోనుచేసితిని. ఫోనుచేసిన 5 నిముషములకు డాక్టరుబాబు వచ్చెను'

"మీరు కిడపూరునుండి వచ్చుటకు బసమార్చుటకు కారణమేమి?"

'అక్కడ సౌఖ్యముగా లేదని నాకుమారుఁడే యిక్కడిబసచూచి వచ్చియుండెను.'

ఆమెపల్కులాలించిన సిమ్కట గిరిధరుఁ డామెవలన తెలియదగిన యంశములు లేవని నిశ్చయించుకొనియెను. అనంతర మాతఁ డామె కిట్లనియెను. 'తల్లీ! తమకుమారుడు నిష్కారణముగా మోహపిశాచమునకు బలియయ్యెను. మీరు లేనపుడు మీ పెట్టెలను దెరచి పరిశీలించగా నొకయుత్తరము లభించినది. ఆయుత్తరములో నొక వారాంగన మీకుమారునివలచి యాతనిని దసవీధికి రాపున ముసకు రమ్మని ప్రార్థిం

చియుండెను. అతఁ డామెకోరిక ననుసరించియే యిచ్చ టకు వచ్చియుండెను. ఆవారాంగనయు నీసమీపముననే నివ సించుచుండెను.' అని సమస్తవిషయములు దెల్పి యామెకడ ననుజ్ఞగొని వెడలిపోయెను.

గిరిధరుఁ డామెవచ్చినయెడల నేమో తెలియఁగలదని యాశించెనుగాని యామెవలన గూడ నేమియు దెలియద య్యెను. హతాశుఁడై యాతఁడు గృహోన్ముఖుఁ డయ్యెను.

* * * * *

గిరిధరలాలు కేసువిషయమై యేమిచేయుదునాయని యాలోచించుచుండగా కేశవలా లరుదెంచి 'అయ్యా! మన ము సీలుచేసినయింటియజమానుఁడు వచ్చియున్నాడు. తన యద్దె పోవుచున్నదనియును, తాళము దీసివైచి సామాను భద్రముచేసికొనవలసినదనియును నోటీసు యిచ్చినాఁడు. ఏమి చేయుటకును దోఁపక మీచెంత కరుదెంచి యున్నాను" అని బల్కెను. గిరిధరుడు "దీనికాలోచన యెందులకు ఒకమా సము దినములవఱకు సామానుదీయుటకు వీలులేదనియును, అపుడాసామానును విక్రయించి యాతనికీయవలసిన బాడుగ యిచ్చివైచెదమనియు ప్రత్యుత్తరమిమ్ము. నీవట్లు వ్రాయుట గాదు. సూపరెంటుదొరవారిచే నట్లు వ్రాయించుము. దాని తో నాతఁడుచూ రాడగ యూరకుండును.' అని జెప్పి వెండి యు నిట్లనియెను 'మనకీమె సోటులభించినది. కాని యిందు

వలన నామెను సరిగా గుర్తింపజాలము. ఇంతియేగాక గంగా రాముని చారిత్రె మెట్టిదో దెలియవలసియున్నది కావున నే నొకసారి యలహాబాదునకేగి రావలయునని తలంచుచున్నాను భవానిసింగునకును లీలాకుమారికిని యెట్లుసంబంధముగలసెనో దెలియరాకున్నది. నేనావృద్ధురాలికేమైన దెలిసియుండునేమో యనిదలంచితిసిగాని యామెకు కుమారుని దుర్నడతనుగూర్చి యేమియు దెలియకుండెను? కేశవలాలు 'మనకు గంగారాము చారిత్రము దెలిసినను దెలియకున్నను లీలాకుమార్తెను బట్టుకొనుటకు దగిన ప్రబలనిదర్శనములు గావలసియున్నవి. ఇంతకును యామె మనకు లభించినప్పుడు గదా! ఆమెయా కలకత్తాయందున్నదో లేక నెక్కడికైన పోయియున్నదో దెలియకున్నయ్యెను. ఆమె యింకను కలకత్తాయందే యున్నచో నింకొకటి రెండు హత్యలు కూడ జరుగగలవని దోచును. ఆమె కారణమున ప్రవహించు నీరక్తవాహిని కంతుగలుగుట యెన్నడో దెలియకున్నది. ఇట్టిపరిస్థితులలో మీరలహాబాదున కేగినయెడల కార్యసాధనమున కింకను విలంబమగుటతప్పదు. అనిబల్కెను. గిరిధరుండు "నేనును నట్లేదలంచుచుంటిని. ప్రభుత్వమువారొసంగినగడువులో నించుమించుగ రెండు మాసములు గతించినవిగాని చేయవలసిన కార్యమును నావ గింజంతయైన జేసియుండలేదు. కర్తవ్యమునుగూర్చియే నే నన యు మాలోచించుచుంటిని' అనిబల్కి మిన్నకుండెను. వీరి

ల్లు మాట్లాడుచుండగ నొకపోష్టుజవాను కొన్నికవరులనుదెచ్చి గిరిధరునకొసంగెను గిరిధరుఁడన్నియునువిప్పి చదువుకొని కేశవలాలును వినుమని యిట్లు చదువసాగెను.

'నీకొసంగిన గడువు మూడుమాసములలో రెండు మాసములుఁ గతించినవి. ఇకను యాయువతీమణిని గూర్చి యేమియు నాకు లభించి యుండ లేదనుట తెల్లమగుచున్నది. కావున నింకనైనను త్వరలో నీకే సునందు పనిజేయుట చాలించి యతిత్వరలో నీవు నోట్లసృష్టినిగూర్చి జరుగుచున్న యత్నమును బాల్గొన వలసినది.

కమీషనరు."

ప్రభుత్వము వారిని వలన కూడ మాటవచ్చుచున్నది. కావున నిప్పుడలహాబాదునకు బోవుట లగ్గుగానోపదు. కావున నిచ్చటనుండియే యత్నమునరింపవలయును. కేశవలాలును యాతని యభిప్రాయముతో నేకీభవించెను. అనంతర మిరువురును సూపరెంటును దర్శించి యాగృహయజమానున కుత్తరము వ్రాయింపవలయునని బయలుదేరిరి.

గృహయజమానుఁడును, తానొసంగిన నోటీసునకు సరియైన సమాధానము రామింజేసి దొరవారితో మాటలాడవలయునని యరుదెంచియుండెను. అతఁడు సూపరెంటు గారితో మాటలాడుచుండగనే గిరిధరుఁడును కేశవలాలును

సూపరెంటును దర్శింపవచ్చి యుండిరి. సూపరెంటు వారల నురావించి యుచితాసనములగూర్చుండ నియమించి యతని నోటీసునకు మీరేల జవాబొసగకైరని కేశవలాలును ప్రశ్నించెను.

కేశవలాలును, గిరిధరుడు జెప్పినట్లే జెప్పెనుగాని యా గృహయజమానుడు 'ఓయ్యా! సుమారు రెండుమాసములయద్దె రావలసియున్నది. 3 వ మాసముగూడ నద్దెలేకున్నచో నించుమించుగా నాకు 3 వందలరూప్యములు రావలసియుండును. అంతవిలువగలుగు నాస్తి యాయింటనుండునో యుండదో యెవ్వరుజెప్పగలరు. నాకు రావలసినమొత్త మాగృహోపకరణము లమ్మిన రాని యెడల ప్రభుత్వమువారు లోటు ధనమొసంగుట కంగీకరించిన యెడల నొక మాసమువఱకట్లే నాగృహము మీస్వాధీనములో నుంచెదను. అందులకెట్టి యభ్యంతరమును లేదు." అని బల్కెను. ఆపలుకులాలించి సూపరెంటాతని పల్కులు యుక్తముగా నుండెననియు ప్రభుత్వమువారింక నావిషయమున నొక్కకాసైనను వ్యయపరుప నంగీకరింపరనియు, వచించి కేశవలాలున కిట్లనియెను. 'మీరు నేడు పత్రికలలో ప్రకటించి దండోరామూలమున దెలియబరచియు రేపటిదినంబున సామానంతయు విక్రయింపుడు. వచ్చినయర్థమున నీతనికిరావలసిన రూప్యములొసంగి శేషించినధనమును సర్కారుఖజానాకు నాపేర జమకట్టియుంచు"

డని యాజ్ఞాపించెను. గిరిధరు డింక నాన్నగారి మాటలు కాదనరాక నేరక యందుల కంగీకరించెను



మరునాడు పత్రికలలో నిట్లు ప్రచురింపబడెను.

"లోయర్ చిట్పూరురోడ్డు 1946-5 గృహమున రెండు మాసములకుపూర్వ మొకశవము పడియున్నదనియు నందుం డెడివా రెక్కడికేగినదియు తెలియదని యింతవరకే ప్రకటింపబడియెను. ఇప్పుడా యింటనున్న గృహోపకరణంబులన్నియు నాయింటియొద్దనే పోలీసువారి యాజమాన్యమున వేలము వేయబడును. పాటదారులు సొమ్మును వెంటనే చెల్లింపవలయును. ఇతరవివరము తెలియగోరువారు గిరిధరులాలుగారినిగాని, ఇన్‌స్పెక్టరుగారినిగాని కలసికొని మాటలాడవచ్చును.

మరియు దండోరామూలమున 1946-5 గృహమునొద్ద గృహోపకరణము లన్నియు వేలమువేయబడునని చాటింపించిరి.

మరునాడు వేలమునకై యొక్కొక్క వస్తువునేదీసి జాపితా వ్రాసి సర్వమును సిద్ధపరుచుచుండిరి. గిరిధరుడు, కేశవలాలు, మణిభూషణుడు సామానంతయును పరిశీలించి రాదగిన వెలలు నిర్ణయించుచుండిరి. చాలభాగము వస్తువులన్నియు నమ్ముడువోయెను. ఇంకను గొన్నివస్తువులు మిగిలియున్నవి. ఒకపరుపును మంచమును విక్రయించుటకు దీసికొనివచ్చిరి. ప్రజలకా మంచమును బాగుగాజూపుటకై యందున్న పరుపును జుట్ట

చ్చెను. అప్పుడామంచముపై నొక బ్యాంకు ప్యాస్‌పుస్తకముం డెను. కేశవులాలాగు నొకపుస్తకమునుదీసి గిరిధరున కొసంగెను. గిరిధరుఁ డాపుస్తకమును దెరచి యొకింతపరిశీలించి, యందేమి చూచెనోగాని, పెన్నిధిఁగన్న చందమున సంతోషపులకాంకితుఁ డయ్యెను. కాని యాతఁడు దనసంతోషమును లోలోన మఱుఁగు పఱచుకొని, యింకను నేమేమి లభించునేమో యను నాశతో సాయంకాలమువఱకును నిరీక్షించెను. ఒకటిరెండు వెండి గిన్నెలుమాత్రమే మిగిలియుండెను. ఆగిన్నెలపై "లీలా కుమారి" యని పేరుండెను. ఆకారణమున సత్యవతి యామె నామమును రూఢిపఱచుటకు నిదర్శనముగా నుండునని దలంచి వానిని విక్రయింపక, యాప్యాస్‌పుస్తకమును వెండిగిన్నెలను దనయొద్దనుంచుకొనియెను. నాఁడువచ్చిన ద్రవ్యమునుండి గృహయజమానునకుఁ జేరవలసినసొమ్ము నొసంగి యమ్ముడు గానివస్తువులను, శేషించిన యేబది రూపాయలను సత్యవతిపరము గావించి గిరిధరుఁడు స్వగృహాభిముఖుఁడై చనియెను.

నాఁటిరాత్రి గిరిధరుఁడు భోజనాదికములను నతిత్వరితముగా నిర్వర్తించుకొని యొకయీజీచైరులో పరుండి బ్యాంకు పుస్తకమునుదీసి యందలిపత్రములు తిరుగవైచెను. కడపటి పత్రమున నొకసారిగా వేయిరూప్యములు బ్యాంకినుండిదీసి కొనబడియుండెను. ఇంకొక వేయిరూప్యములు మాత్రమే

నిలువయుండెను. బ్యాంకినుండి సొమ్ముదీసికొనిన తారీఖును
బరికించెను తోడనే యాతని కేమిదోచెనోగాని యచటనుండి
లేచి తనడైరీపుస్తకముదీసికొని తిరుగవేసెను. గంగారాము
మరణించిన దినమునకొక పదిదినములకే ద్రవ్యముదీయ
బడియుండెను. మరికొలది దినములకే యామెగృహమున మరి
యొకహత్య జరిగియుండెను. నాఁడే యామెగృహమునువీడి
వెడలిపోయియుండెను. అనంతరమాతఁ డిట్లు వితర్కించు
కొనియెను.

“గంగారాము వధింపబడుటయు భవానిసింగు వధింప
బడుటయు నీమెకుదెలిసియేయుండును. పైగానీమెకు మేమా
మెకొఱకు యత్నించుచుంటిమనియు దెలిసియుండును. ఆకా
రణముననే యామెబ్యాంకులోనుండి ధనమునంతయు సంగ్ర
హించుకొని వెడలిపోవనెంచెను. కాని బ్యాంకివారు ద్రవ్యమం
తయు నొక్కమారుగా నీయకుండుటచే నామె యిచ్చటనే
యుండవలసివచ్చియుండును. అనంతరమామె యనుకొనని
యట్లు రామానందచటర్జీ యామెను జూడవచ్చియుండును.
ఆతనితోనేగుటకిష్టములేక నామె యాతనివధించి యింకనిచ్చట
నిలచుట లగ్గుగాదని వెడలిపోయియుండును. అయ్యదికాదేని
యామెను పేరొకడు వలచి రా యామెతోసంబంధముగల్గి
యుండెను. ఆతఁడే రామానందచటర్జీని వధించి లీలాకుమారి
నిగూడ దోడ్కొనిపోయియుండవచ్చును. అట్లయినయెడల లీల

యింకను కలకత్తానగరమును విడచియుండదని తలంపవచ్చును. ప్యాసుపుస్తకమును బట్టిచూడగా నామెయే స్వయముగా నేగి ద్రవ్యమును దీసికొనియున్నట్లు దోచుచున్నది. అట్లే కాని యెడల నామెస్వయముగా బ్యాంకికిఁ బోవలసినపని యుండదు. అని వితర్కించుకొని మిగిలిన వేయిరూప్యములును దీసికొనుటకామె యత్నింపక మానదు. కావున నపుడామెను బట్టుటకు వీలుగల్గును. ఇప్పుడొకసారి బ్యాంకుమేనేజరుగారిని సందర్శించి వారికీవృత్తాంతమంతయును దెలిపి యా వేయిరూప్యములును యామె చేతులఁబడకుండఁ జేయవలయును. అనుచు బెద్దయుంబ్రొద్దు వితర్కించుకొని యాతఁడు సుమారు పదునొకండుగంటలకు నిద్రించెను.

## ఏడవ ప్రకరణము.

### యూసఫ్ ఖాను.

గిరిధరు డుదయమున మేల్కాంచునప్పటికి సుమారేడుగంటలు దాటినది. అతఁడు కాల్యముల త్వరలో దీర్చుకొనినాడు. చేయవలసినకార్యక్రమముగూర్చి యాలోచించుచుండెను. ఇంతలో కేశవలా లరుదెంచెను. గిరిధరు డాతనినొక కుర్చీపై గూర్చుండ నియమించి యిట్టులనెను. "నేనిక్కడనే యుండి పనిచేయవలసియుండుట నిశ్చయమయ్యెను. కాని యామెను బట్టుకొనినపిమ్మట కేసు సరిగా నడుపుటకు వల

యుపకరముల సంపాదించు టావశ్యకమై యుండుటచే నలహాబాదున కొకయినస్పెక్టరును బంపవలయును. లేదా యచ్చటి పోలీసువారి కక్కడి విషయములన్నియును దెల్పి లీలాకుమారియొక్క ఫొటోనుబంపి యామెయొక్క చరిత్రమును సంపాదింపవలయును. ఇంతియగాక గంగారాముయొక్క చరిత్రమంతయును గూడ నెఱుంగవలయును అచ్చటికి బంపుటకు దగినవాఁడెవ్వఁడైన నుండెనా? లేక పోలీసులపేర వ్రాసి వారివలననే సకలమును గుర్తెఱుంగుట మేలా? ఈవిషయమును మీరుగూడ నాలోచింపు"డని బల్కెను.

కేశవలాలు కొంతవడి యాలోచించి యాతనికిట్లనియెను. 'ఇచ్చటినుండి యలహాబాదునకు బంపుటకు దగిన సామర్థ్యముగలవాఁడెవ్వఁడును లేడు. అక్కడిపోలీసులనే దర్యాప్తుచేసి దెలుపవలసినదని వ్రాయుట మేలు కాని వారిరిపోర్టు వచ్చునంతకు నిరీక్షింపవలసి యుండునేమోగదా' యని బల్కెను. గిరిధరుఁడు 'మనము నిరీక్షింపవలసి వచ్చునని యాలోచించుచుంటిరా! నిరీక్షింపక నిప్పుడు చేయునదేమున్నది? ఆవిషయము నటుండనిండు. మనముచేయఁదలసిన ప్రయత్నములు చేయుచుందము. ఆమె యీలోపుగా పట్టుపడినయెడల, అపుడామెయందు నేరారోపణ జేయుటకు వీలులేనియెడల అలహాబాదుపోలీసువారి రిపోర్టు వచ్చువఱకును గామె నరెష్టులో నుంచవచ్చును. లేదా యిప్పుడే నేనేగి కావలసిన పరి

కరములతోబాటామె చారిత్రమును గనుగొనివచ్చెదను. కావున నేడవశ్యము నహాబాదున 'ఉత్తరము వ్రాయుఁడు.' అని బల్కెను.

కేశవలా లుత్తరమున్ వ్రాసి పంపెదననిబల్కి యింకను జేయవలసిన కార్యములేమైన గలవాయని ప్రశ్నించెను. గిరిధరుఁడు లేవనియెను. కేశవలాలు పునర్దర్శన మెప్పుడని ప్రశ్నించెను. గిరిధరు డగత్యమగునెడల మూఁడుగంటలకు తాణాకరు దొంచెదనని బల్కెను. కేశవలాలు వెడలిపోయియుండెను. గిరిధరుఁడు గడియారమువంక జూచెను. సుమారు పదిగంటలై యుండెను. అతఁడు బ్యాంకికి సరిగా పదునొకండుగంటలకు బోవ సంకల్పించుకొనిభోజనాదికముల నిర్వర్తించుకొన నేగెను.

* * * * *

గిరిధరుఁడు బ్యాంకికి సరిగా పదునొకండుగంటలకేగెను ప్రిసిద్ధమమున నాఁతడు షరాబుగానున్న యూసఫ్ఖానను నొక మహమ్మదీయుని గలసికొనియెను. అతనితో నిట్లు ప్రసంగించెను.

గిరి—ఈపాస్ బుక్కులో నుదాహరింపబడిన విత్ డ్రాయల్ చేసిన వారెవ్వరో మాకు గావలసివచ్చినది.

యూసఫ్—ఆపుస్తకముగలవారే ద్రవ్యమును తీసికొని యుంచుకొను. ఆవిషయమునమీకు సందేహమెందులకు?

గిరి—ఆమాత్రము తెలిసికొనలేదు. కాని ఎవరు స్వయముగావచ్చి తీసికొనియుండిరా? లేక ఏజంటుద్వారా తెప్పించుకొనియుండిరా?

యాస—అసంగతి ఎప్పుడెట్లు తెలియగలదు— కాని మీరెవ్వరు. ఈపుస్తకము మీకెట్లువచ్చినది. ఇప్పుడు మరల ధనమును విత్ డ్రా చేయుటకు వచ్చియుండిరా?

గిరి—పుస్తకము గలవారియొద్దనుండియే దీసుకొని వచ్చితిని.

యాస—ఎప్పుడు? (పుస్తకమును జూచి) విత్ డ్రా యిచ్చు టకు వీలులేదే—

అట్లు మాట్లాడునపుడాతని ముఖభావములన్నియు. గిరిధరుడు పరికించుచుండెను. అతఁడు యీమహమ్మదీయుఁ డేల నాప్రశ్నలకు సమాధాన మీయకుండెను. అని యాలో చించుచు నింకనాతనితో మాటలాడినయెడల లాభముండ దని యెంచి దొరను గలిసికొననేగెను. దొరగారి కాపుస్తక మునుజూపి యీవిత్ డ్రాయల్ చేసినదెవ్వరో యాసంతకము నమోనా గావలసియున్నదనియును, ఆమెకు యింకను బ్యాంకియందు నిలువయున్న పైకమును త్వరలోనీయక నిలి పియుంచవలసినదనియును, అట్లు నిలువుటకు వీలులేనియెడ ల సొమ్మును విత్ డ్రాచేయుటకు వచ్చినవారిని తత్క్షణమే పోలీసువారికి వప్పగింపవలసినదనియు జెప్పెను. దొరగారా

తనిజూచి మీరేల యీవిషయము నెఱుంగుటకు యత్నించు చున్నారని ప్రశ్నించెను.

గిరి—అయ్యా! ఈమెయింట నొకహత్యగావింపబడి యున్నది. ఆమె యదృశ్యురాలైయున్నది. ఆమె యాచోకి దెలియక మేము పరితపించుచుంటిమి. మాకీపుస్తకము నిన్నటి దినముననే లభించినది. ఈమార్గముననైన నామెను బట్టు కొనగలమేమోయని యాశించుచున్నాము. కాని ఈసంగతి మాత్ర మితరుల కెవ్వరికిని దెలియనీయవలదని నాయభి ప్రాయము.

గిరిధరుని పలుకులాలించి యిమ్మట దొరగారును "ఆమెనుబట్టి త్వరలో బంధింపవలయును. ఇట్టివారలకు స్వేచ్ఛ యొసంగుటెంతమాత్రమును మంచిదికాదు. మావలన గలుగవలసియున్న సహాయమున కెప్పుడును మీకు లోటు గలుగదు. ఈపుస్తకమును మీచెంతనే యుంచుకొనుడన్ని పుస్తకములు బారవైచికొనినవారు సొమ్మునుపుచ్చుకొన యర్జీ పెట్టినకాగితములన్నియు నాకడకు రాగలవు. అప్పుడునేను పరిశీలించి యామెయిట్టి దరఖాస్తు బెట్టినయెడల తమకప్పగించెదను." అని బల్కెను. గిరిధరుడందులకు కృతజ్ఞతాపూర్వకముగా నమస్కరించి యామె సంతకమును జూపుటకు వీలగునాయని ప్రశ్నించెను. దొరగారొక గుమాస్తాను బిలిచి యాతనికానాడు విల్ డ్రాయల్ చేసిన వారియర్జీలను గొనిర

మాస్టారెల్లగాను 3 గంటలకే వెడలిపోవుచుండిరి. గిరిధరుడు దానరుదెంచిన కార్యము సఫలముగాకయుండునని దలంచుచు బ్యాంకినమీపమునను దిరుగుచుండెను. ఒక బ్యాంకినౌకరు గ్రామమున డెలివరీ (Delivery) చేయుచు మిగిలిన యుత్తరములగొని యాఫీసున కరుదెంచుచుండెను. సాధువాతని సమీపించి షరాబుగారిబస యెక్కడనని ప్రశ్నించెను.

నౌకరు—షరాబుగారితో పనియున్నదా?

గిరి—లేదు. ఆయింటిసమీపమున మాబంధువొక్కడు నివసించుచున్నాడు. అతని దర్శింప నెంచితిని.

నౌకరు—బౌబజారులో.

గిరి—బౌబజారులోనా? ఇంటినెంబరు తెలియునా?

నౌకరు—1498_3 నెంబరుగృహము.

గిరి—మంచిదినాయనా? అచ్చటికేగి నాకు మాస్టరుచేసిన మా బంధువుని గలిసికొనగలను.

నౌకరాఫీసులోనికి వెడలిపోయెను. గిరిధరుడు గమన వేగమును హెచ్చించి బౌబజారునకేగెను.

* * * * *

1498_3 నెంబరు గృహమొక సాధారణమగు చిన్న రెండంతస్తులభవనము. ఆ యింటిక్రిందిభాగమున యూసఫ్ ఖాను ను, పైభాగమున సింకోకరును గాపురముండిరి. ఆయింటికెదుట నొక టీషాప్ గలదు. (Tea Shop) గిరిధరుడా టీషాపు

లోనికరిగి కూర్చొని యూసఫ్‌ఖానుని రాక గమనించుచుండెను. అప్పటికి సమారారుగంటలు కావచ్చినది. అప్పటికిని యూసఫ్‌ఖాను వచ్చియుండలేదనుట దెలిసికొని త్వరలోనే యాతడరుదెంచునని నిరీక్షించుచుండెను. ఆహోవుయజమాని యాతని సమీపించి "అయ్యా తేనీరునుగొనితెమ్మని సెలవా" యని ప్రశ్నించెను. ఊరక నచ్చట కూరుచుండుట యనుమానమునకు గారణమగునని దలంచి గిరిధరుడు తేనీటిని గొనిరావలసినదని బల్కెను. హోవుయజమాని టీ దెచ్చుటకై లోనికరిగెను.

గిరిధరు డిట్లనుకొనియుండెను. సాయంకాలము 3 గంటలకే యాఫీసునువదలి వచ్చినట్లు దెలియవచ్చినది. అక్కడనుండి యీతడిచ్చటికి గంటన్నర దాటుచున్నను గృహమునకు రాడయ్యెను ఇంతకాల మీతడెక్కడ గడిపియుండెనో గదా యనుకొనుచుండగా యూసఫ్‌ఖాను గాన్పించెను. అతడొకమంచి సిగారును గొని లోపలికేగుచుండెను. ఇయ్యెడ గాంచి యిదియేమి? నేను దురభిప్రాయమునకు వచ్చియుండ లేదుగదా? యని యనుకొనుచు నింకను బరిశీలింప వలయునని నిశ్చయించుకొనియెను. ఇంతలో నౌకరు తేనీటిని గొని వచ్చి యాతని ముందుంచెను. కాని గిరిధరుడాతడు తేనీటిని గొనితెచ్చుట గమనింపలేదు. ఆతని దృష్టియంతయు యూసఫ్ ఖానుపైననే యుండెను. అతడు దనయింటి గుమ్మము

కడ నిలచి తలుపుతట్టెను. లోపలనుండి 8 సంవత్సరముల వయస్సుగల యొక బాలిక వచ్చి తలుపుతెరచెను. అతడు లోనికేగెను. గిరిధరు డాగృహమును సమీపింప నెంచెను. కాని పలువురు తన్నచ్చట జూచుటచే నచటికేగిన దన్ను సంశయింతురని తలంచి యటనుండి వెడలిపోవలయునని లేచెను. అప్పు డాతడు బల్లపైనున్న తేనీటిని జూచెను. తోడనే యాతడు టీ త్రాగకుండ వెడలిపోయిన నితరులయను మానమునకు గురియగుదునని తలంచి మరల గూర్చుండి టీ ద్రావెను. అనంతర మాతడు యజమానున కీయవలసిన డబ్బుల నొసంగి యటనుండి వెడలిపోయెను. అతడొక మరుగున కరిగి తన వేష మొకింత మార్చుకొని తొల్లిటి యుడుపుల నొకచో భద్రపరచి యూసఫ్‌ఖాను గృహమువంక కరుదెంచుచుండెను. అప్పటికి సుమారు రెనిమిది గంటలు దాటి యుండెను. యూసఫ్‌ఖాను వీధి గుమ్మముకడ నిలచియుండెను. గిరిధరుడాతనిని మారుమూలనుండియే దీక్షించి సమీపింపక దూరముననే నిలచి పరికించుచుండెను. లోపలినుండి బాలిక యరుదెంచి యూసఫ్‌ఖానుని సమీపించి మరల నెప్పుడు వచ్చెదవని ప్రశ్నించెను. త్వరలో వచ్చెదనని బలికి యామెను లోనికేగి తలుపు వైచుకొమ్మనియెను; యూసఫ్‌ఖాను గుమ్మము దిగి నడచుచుండెను

గిరిధరుఁ డాతని వెంబడించెను. ఆతఁడును వినవిన నడచుచుండెను. తనవెంట నంటి వచ్చు గిరిధరు నాతఁడు గుర్తించియుండమిచే నెచ్చటివలె నొకయింటి గుమ్మముకడ నిలచి తలుపుతట్టెను. లోపలినుండి యెవ్వరో తలుపుదెరచిరి. యూసఫ్‌ఖానుఁడు లోనికేగెను. తలుపులు వెంటనే మూయబడెను. గిరిధరుఁడు లోనబ్రవేశించుట కనువగు మార్గమేమైన లభించునాయని యాలోచించుచు పరిసర ప్రదేశముల బరికించెను. ఆతని కచ్చటనుండి కదలిపోవలయునని లేదు లోనికేగుటకు మార్గము గాన్పించకున్నది. అక్కడనున్న నాతఁడు సమీపమునవున్న బీటులోనున్న రక్షకభటుని బిలిచి తనజేబునందున్న నోటుబుక్కుపై కేశవలాలను కొఱకను తగనియును వ్రాసి యద్దానిని యారక్షకభటునకొసంగి కూర్మ నచ్చటికి గొనిపోవలయును అని బంపెను.

యూసఫ్‌ఖాను ప్రవేశించిన గృహమొక సామాన్యమైనది. ఆ యింటికి వెనుకనైయున్న మరియొకరి బహ్యసౌధమున్నది. ఆగృహములోనుండి వెలికేగుటకు వీధిద్వారముగాక మరియొక గేటుగుమ్మము కూడ నున్నది. ఆగేటు తలుపుంగ లోనబంధింపబడియుండెను. గిరిధరుఁ డాగేటును సమీపించి చూచెను. ఆమార్గమున లోనికేగుట సులభముగా గాన్పించెను కాని యచ్చటినుండి యింటిలోని కేగు

టకు మార్గముండగా యెడల నచ్చుటకేగుట వృథాయాసము గునని యాలోచించుచు నింక నాలోచనములతో కాలము ను వ్యర్థము జేసిన కార్యము మించి వచ్చునేమో యను సంది యముతో గిరిధరుడు తలుపులపై కాలు నేసి పైకెక్కి సు నాయాసముగా లోనికేగెను. కాని యటనున్న యెడల లో పలివారి సంభాషణగాని యలుకుడు గాని వినవచ్చునేమో యని యొకించుక కాలము నిలచి వినియెను. ఎట్టియలుకు డును వినరాలేదు. అతడు పరిశీలింపగా నొకమార్గము గాన్పించెను గాని యామార్గమింటిలోనికి గాక వేరొకదొడ్డి లోనికి బోయియుండెను. గిరిధరు డచ్చటికి గూడ బోయెను. కాని, యింటిలోని కేగుట కనువైనమార్గము గాన్పింపద య్యెను. లోపలనున్న వారిసంభాషణముగూడ వినిపింపదయ్యె ను. అతడింకను నటనుండిన యెడల కేశవలాలు వచ్చునే మో యనియును-యాసఫ్ఖాను వెడలిపోవునేమో యనియు సందియములతో వీధిలోని కరుదెంచెను. అతడరుదెంచి నప్పటికే కేశవలాలు 4 గురు రక్షకభటులతో నచ్చటి కరు దెంచియుండెను. గిరిధరుడాతని గలసి కొన్నినిమేషములు రహస్యముగా మాటలాడెను.

వారిరువురును రక్షకభటులను ద్వారమున కావలీవల నిల్పి జాగరూకతతో పహరాయొసంగుచుండ వలెననియు లో పలినుండి యెవ్వ రరుదెంచినను బట్టుకొనవలసినదిగా యాజ్ఞా

పడుచరి. కేశవలాలు గిరిధరుడును గలసి యాయింటివెనుక సందునకేగి ఆ గృహమునకు సరిగా వెనుకనున్న గృహాయజమానిని గలసికొని యాతనితో నిట్లు ప్రసంగించిరి.

“అయ్యా! మేము కొండొకకార్యార్థమై విచ్చేయుచుంటిమి. అందునుగూర్చి కొన్ని యంశములు మీవలన నెఱుంగగోరితిమి.”

‘నావలన మీ కేయే విషయముల దెలియవలసి యున్నవి?’

“తమ గృహమునకు వెనుక పంజాబురోడ్డున నున్న గృహమున నెవ్వరున్నారు? వారెన్ని దినముల క్రిందట నుండి యున్నారో చెప్పగలరా?’

‘ఎవ్వరో యొకయువతి నివసించుచున్నది. ఆమె సుమారొక మాసము దినములనుండి యిచ్చట నివసించుచున్నది.”

‘మాసము దినములనుండియేనా?’ యని గిరిధరుడు సంశయాకులచిత్తుడై ప్రశ్నించెను.

“అవును. రెండుమాసముల క్రిందటివఱకు నామిత్రుఁ డొక్కరుఁ డాయింట నుండెను. ఇప్పుడాతఁడీ గ్రామమును యుద్యోగరీత్యా విడువవలసివచ్చెను. అతఁడు వెడలిపోయిన తరువాత యొకమాసమువఱకును యిది ఖాళీగానే యుండెను.’

"ఆయింట నీవలిగియున్న యాతని నామధేయమేమి?" యని గిరిధరుఁడు ప్రశ్నించెను.

"సురేంద్రనాథుఁడు—"

అనంతరము వారిరువురును సూర్యగృహాయజమానుని కడ సెలవుదీసికొని బొంబాయిరోడ్డునకు వచ్చిరి—అట రక్షకభటులవలన యింటినుండి యెవ్వరును వెడలిపోవలేదని దెలిసికొని సంతసించిరి.

గిరి—ఆలస్యమేల? ఆనుకొనినట్లొనర్తుమా?

కేశ—మంచిది.

---

## ఎనిమిదవ ప్రకరణము.

---

విశ్వప్రయత్నము.

గిరిధరుఁడిరువురు రక్షకభటులను గేటుగుమ్మమును దాటి తనవెంట రావలసినదని జెప్పి దొడ్డిలోనికి గొనిపోయి గృహము నుండి దొడ్డిలోని కరుదెంచు ద్వారమునొద్ద నిల్చి "ఈమార్గమున నెవ్వరైన వచ్చినయెడల బంధించియుంచుఁడు. నాయొద్దకు రావలయునని యీలవేయుఁడు. మీరాతని బంధించుటకు వీలుగలుగనియెడల, నాతఁడు బలాధికుఁడై మిమ్ముల జయింపగలడని దోచినయెడల బిగులు వేయుఁడు. తోడనే మేము

గూడ నీపాట్లు బెట్టుకొంటివా" యని బల్కెను. ఆపల్కు లాలించినతోడనే యాసఫ్ తనచరిత్ర సంతయును వెల్లడి యయ్యెనని దలచి గాబోలును చరాలున నొకగదిలోనికేగి తలుపు లోన బంధించుకొన యత్నించుచుండెను. ఇంతలో రక్షకభటులు తలుపును వెనుకకు ద్రోయుచు నామెనుబట్టుకొన యత్నించుచుండిరి. ఇంతలో కేశవలాలు గిరిధరులుగూడ వచ్చుటకెరుదెంచిరి. ఆమెయు తనయత్నములన్నియు వృధ యగుట కెంతయో చింతించుచు ప్రక్కనేయున్న బాకును గైకొని వక్షస్థలమున సత్తువకొలదిగ బొడుచుకొనియెను హాహా కార మొనరించుచు క్రిందబడిపోయెను. గిరిధరుడు "లీలా! ఎంతపనిజేసితివి." యని పల్కుచు నామెను సమీపించెను. ఆమెయు రక్తవాహినిలోబడి కొట్టుకొనుచుండెను. గిరిధరుడు నలువైపుల దిలకించెను. ఒకవైపున యాసఫ్ఖాను రక్తవాహినిలో బడియుండెను. గిరిధరుడామెను, యాసఫ్ఖానుని దిలకించి కార్యమంతయును ధ్వస్తమగుట కెంతయో చింతించి లీలాకుమారితో "లీలా! యింతటి సాహసకార్యమున కొడిగట్టి తివా?" యని ప్రశ్నించెను. కేశవలాలు తక్షణమే యొకరక్షక భటుని సమీపమునయున్న డాక్టరును గోడ్కొనిరావలసినదని బంపెను. గిరిధరుడు లీలాకుమారిని దిలకించి "లీలా! ఇప్పుడైన నీనేరములు నొప్పుకొందువా! నిష్కారణమేల యాసఫ్ఖా

ముని వధించితివి.” యని ప్రశ్నించెను. ఆమెయు మూర్ఛాక్రాంతురాలై బాహుమని సంజ్ఞచేసెను. గిరిధరుఁడాయింట గలయు వెళ్లి మంచినీరము గొనితెచ్చి యొసంగెను గిరిధరుఁడు దొడ్డితలుపును దెరచి యచ్చట దానివలన నిలిపియుంచిన రక్షకభటులను లోనికిబిలిచి యిరుగుపొరుగువారి నెవరినైన దీసికొనిరావలసినదనియు, రెండుబుడ్ల బ్రాందిని గొనిరావలసిన దని పంపెను.

వారిరువురును 5 నిముషములలో నచ్చటికి వచ్చిరి. గిరిధరుఁడు బ్రాందిని కొలదిగా నొకగ్లాసులోబోసి లీలాకుమారిచే ద్రావించెను ఆమెకొకింతబాధ తగ్గినటు నుండెను ఇంతలో డాక్టరువచ్చి యొకటిరెండు మోతాదులామెచే ద్రావించెను. అంతట గిరిధరుఁడు డాక్టరు బాబుతో నీమె “జీవించునని యాశలేదు మరణవాఙ్మూలము దీసికొనవలసియున్నది గదా” యనియెను. డాక్టరు గాయమును పరిశీలించెను. అయ్యది హృదయకుహరమున కించుక ప్రక్కగా దగిలియుండెను. అంత నాతఁడు గిరిధరునితో ‘నయ్యా గాయమపాయకరమైనదియే కాని, హృదయకుహరమున కొకింతదూరమున దగులుటచే నీమె రెండుమూడు గంటలకాలము జీవింపగలదు. ఆబాకును దీయకుండ నట్లే యుంపవలయును. ఈలోపున మరణవాఙ్మూలము పుచ్చుకొనవలయును.

గిరిధరుఁడు లీలాకుమారితో—"డాక్టరుబాబు పల్కు-లాలించితివా? నీముఖమునను వినవలసియున్న నీచరిత్రమంతయును దెలుపవలయును" యనిపల్కెను.

అప్పటికా యిరుగుపొరుగునున్న నలువురైదుగురు గృహస్థులను రక్షకభటుఁడు దోడ్కొని వచ్చెను. లీలాకుమారి గిరిధరుని కిట్లనియెను. నాచరిత్ర మాలించుటకు కుతూహల మానసుడవై యున్నట్లున్నది. అయినను నీవు దెలియవలసిన దంతయు నీవఱకె దెలిసికొనియుందువు. అయినను నావలన విననెంచితివి గావున వినుమని యిట్లు జెప్పసాగెను.

అలహాబాదు గ్రామమున నే నొక వారకాంతచే బెంపబడితిని. నాకు 12 వత్సరముల ప్రాయము వచ్చువఱకును నేనామెను నాతల్లిగనే తలంచితిని గాని యటుపిమ్మట నామె వేఱొకరితో నావిషయమును గూర్చి సంభాషించుచుండ మాటునుండి విని నిక్కువమెఱింగితిని. ఆమెయే నాకు విద్యాబుద్ధుల జెప్పించెను. పదునారువత్సరములకామె చెప్పినట్లెల్ల ప్రవర్తించితినిగాని నాసంపాదనయంతయు నామె యభ్యాసములకు కుటుంబఖర్చులకును జాలదయ్యెను. అట్టిస్థితిలో రామానందచటర్జీగారు మాసమునకు ముప్పదిరూప్యములొసంగుట కంగీకరించి మాగృహమున కరుదెంచుచుండెను. నేనును చాటునమాటునను కొలదిగా ద్రవ్యమార్జించుచు, నాతఁడు గొప్పవాఁడగుటచే నాతనివద్దనుండియే ధనమును సం

గ్రహించుటకై విశేషముగా యత్నించితిని గాని యాతఁడు పరమలోభియగుటచే నామాయలకాతడు జిక్కడయ్యెను. ఇట్లుండగా గంగారాము తరచుగా మాయింటికరుదెంచుచు నెడనెడ ధనమొసంగుచుండెను. ఆతడు నాపై మక్కువగొని నాకు నెలకు 50 రూపాయలిచ్చుట కంగీకరించెను ఇంతియె గాక అపుడొక్కమారుగా నొకవేయి రూప్యములనుగూడ యొసంగియుండెను.

నేనాతని వలుకులకు లోనై యాతనితో జీవయాత్ర గడవుటకు నిశ్చయించుకొని యొక్కనాటిరేయి యాతనితో గలసి కలకత్తావచ్చితిని. ఒకవత్సరము హాయిగ గడచిపోయినది. గంగారామునకు నాయందు నిష్కారణముగ ననుమానము జనించెను. అక్కారణమువలన నన్నుకొలదిగా ననహ్యించుకొనుచు తొల్లిటిప్రేమను మరచియుండెను. అట్టిపరిస్థితులలో ననే భవానీసింగు పరిచయముగలైను. అతఁడు యువకుఁడు, సుందరుఁడు, ధనికుడును యగుటచే యాతనిని నావంక కాకర్షించుకొంటిని. గంగారాముని విడచిపోవలయునని దలఁచుచుంటినిగాని యాతఁడు నాపై లేనిపోని యధికారమును జెలాయించుచుండెను. ఇట్టిస్థితిలో మనోహరసేనుఁడు నన్నొకసారి గాంచి మోహావేశుఁడై నెలకు నూటయేబదిరూప్యము లిచ్చెదననియు దనస్వాధీనములో నుండవలసినదనియు నాకువర్తమానమంపెను. నేనంగీకరించి యాతనిని రహస్యముగా నా

గృహమునకు రావలసినదంటిని. ఆతఁ డనుదినమునను సాయం
కాలమువచ్చి వెడలిపోవుచుండువాఁడు. గంగారాము మాతని
రాకడ గ్రహించి నన్ను మరింతగా బాధింపసాగెను. ఒక్కదిన
మున గంగారాముని ధిక్కరించి నేను గృహమునుండి వెడలి
పోయెదనంటిని. ఆతఁడు నన్ను విడువజాలక యూతని డిచ్చుదాని
కంటె నెక్కుడుగా నొసంగెదనని చెప్పెను. అయినను నేనంగీక
రింపక నా మార్గమున కడ్డురాకుండినచో యుండుదును లేని
యెడల నీయిచ్చవచ్చినచోటున కేగుము నాస్వాతంత్ర్యము
నేను నీకొరకై గోల్పోవజాలనంటిని. అంత నాతఁడు మండిపడి
నన్ను గొట్టి యెచ్చటికో వెడలిపోయెను. అనంతరము భవానీ
సింగు వచ్చి నన్ను సేదదీర్చి మంచముపై బరుండబెట్టి వివిధో
పచారములచేసి నాకు స్మృతికలుగునంతవరకు మాయింటనే
యుండెను. నాటికి గంగారాము డింటికివచ్చియుండ లేదు.
మరునాఁ డుదయముననే వచ్చి నన్నుగాంచి ప్రాధేయపూర్వక
ముగా క్షమింపుమని ప్రార్థించెను. నేనును యాతనివలన
సుమారు 3 వేలరూపాయల ద్రవ్యమును దినియుండుటవలనను
ఇంకను నాతనివలన గొంతద్రవ్య మాశించి యున్నదాననగుట
వలనను నాతని నానాడు ప్రేమించినట్లు నటించితిని. ఆతఁ డా
దినముననే నాకు 200 ల రూప్యముల నిచ్చియుండెను.

అనంతర మాతఁడు మనోహరసేనుని మాటయే దలం
పక యెప్పటి యట్లు ప్రవర్తించుచుండెను. అంత నే నీతఁ

డాతని కెగ్గుజేసియుండునని దలంచి భవానీసింగును ప్రేరేపించి యాతనివలన నిక్కువమంతయు నెఱిగితిని. అనంతరము భవానీ సింగాతనిని లోకువజేసికొని నాకొరకై తరచుగా వచ్చుచుం డెను. గంగారాము డీసంగతి గనిపెట్టి యాతనివదలించుకొను టకు గూడ కృతనిశ్చయుడయ్యెను. ఈసంగతి గనిపెట్టి భవానీ సింగుతో నే నిట్లంటిని. "ఈతని పీడమాన్పుకొనకున్న యెడల చిక్కులకు లోనగుదుము. మంచిమాటలతో నీతని సాగనంపు టయె యుక్తము. ఆతడు మనచేతుల జిక్కియుండుటచే బెద రించినయెడల తప్పక పారిపోవును" అనిన విని యాతఁ డట్లొ నర్చ నంగీకరించెను. మరిరెండు దినములకే యాతఁడును గంగారాముఁడును మరణించిరి.'

"లీలా! గంగారాముఁ డిచ్చట నేదేని వ్యాపారమున నుండెనా"

"అగును. ఆతఁ డొకకంపెనీలో కూలీలచే పనిచేయిం చుచుండు నుద్యోగముననుండెను కాని చనిపోవుటకు బూర్వ మాతఁడు పది పదిహేనుదినముల క్రిందటనే యుద్యోగమును మానుకొనియుండెను."

"ఏకంపెనీలోననో దెలియునా?"

"నాపెట్టెలో కాగితములున్నవి జూచుకొనుఁడు."

అని చెప్పునంత కామె కాయాసమధికమయ్యెను. డాక్టరుగారు మరల నొకమోతాదుమం దొసంగెను. గిరిధరుఁడు

మరల కొలదిగా ప్రాందిని ద్రావించెను. కొన్నిదినములకు స్వస్థముగా నుండెను.

## తొమ్మిదవ ప్రకరణము.

మరణవాఙ్మూలము.

మరల లీలాకుమారి యిట్లు జెప్పనారంభించెను.

గంగారాము భవానీసింగు లిరువురును మరణించిన వార్త దెలియుటతోడనే నేనా గ్రామమునుండి వెడలిపోవలయునని సంకల్పించుకొంటిని. అప్పటికి నాపేర 2 వేల రూప్యములు బ్యాంకిలోనుండెను. బ్యాంకిలోనున్న ద్రవ్యమంతయును దీసికొననెంచి యొకనాడు బ్యాంకికేగితిని. ఆనాడు ద్రవ్యమంతయును నొక్కసారిగా నీయబడదని దెలిసికొని మొదట 1000 రూప్యములను దీసికొంటిని. ఆనాడు హ్యాన్ బుక్కు వడ్డి కట్టుటకై యధికారులు దమకడ నుంచుకొనిరి. నాడే యూసఫ్ఖాను నన్ను జూచి నాతో మాటలాడగోరెను. నేనందుల కంగీకరించి యాతనికి నానివాసమును దెల్పితిని. ఆత డారాత్రి నాగృహమున కరుదెంచెను. తన యధీనములో నుండవలసినదని ప్రార్థించెను. నేను నా గ్రామమును విడచిపోవసంకల్పిం

చుకొనిన సంగతి యాతనికి దెల్పి యిప్పటిలో నీవిషయమును గూర్చి నిర్ధారణగా వచింపజాలనంటిని. ఆతఁడును నాకై యెక్కువగా ప్రయత్నములు సల్పి నన్ను తనయింటిసమీపముననున్న గృహమునకు వచ్చి నివసింపవలసిన దని ప్రార్థించెను. నాలు గైదు దినములలో నాలోచించి జెప్పెదనంటిని. ఆతఁడు బ్రహ్మానందభరితుఁడయ్యెను.

ఇట్లుండగా నొకదినమున గొన్నివస్తువుల గొనితెచ్చుటకై నేను న్యూమార్కెట్టున కేగితిని. అచ్చట రామానంద చటర్జీ నన్ను దిలకించియుండెను. నే నాతని నాజనసమూహమున గుర్తించియుండలేదు. ఆతఁడు నావెనుకనే మాయింటికరుదెంచి యింటినెంబరు గుర్తించుకొని వెడలిపోయెను. నాటి రాత్రి సుమారు తొమ్మిదిగంటలకాతఁడు నాగృహమునకరుదెంచెను. ఆతనిగాంచినంతనే నేను చకితురాలనైతిని. ఆతఁడు నన్ను తనతో మరల నలహాబాదునకు రావలసిన దని ప్రార్థించెను. నే నంగీకరింపలేదు. ఆతఁడు బలవంతపరచెను. నే నెంతయో బోధించితిని. నావలన నింక నీకు సౌఖ్యము కలుగదని వేయివిధముల జెప్పితిని. ఆతఁడు మోహరసావేశుఁడై నన్ను బట్టనుంకించెను. నేను మరల నాతనిప్రబోధించితిని. నాపల్కు లాతఁడు చెవిజేర్పడయ్యెను. పైగా నాతఁడు నాపైబడి పరాభవింపసాగెను. అంత నేను కోపమాపుకొనజాలక బల్లపైనున్న కత్తినెత్తి యాతనిగొట్టితిని. తోడనే యాతఁడు

క్రిందబడియెను. నేను కడుంగడు భయమునంది యాతని నచ్చటి నుండి లేవదీయ యత్నించితిని — కాని సాధ్యముకాలేదు. క్రిందబడిన నాలుగైదు నిముషములలో కొట్టుకొని యాతడు మరణించెను. అసహాయురాల నగుటచే యాశవమును యావలబారవేయించుటకు వీలుగలుగమి చింతించి కడకాశవము నచ్చటనే విడిచిపోవనెంచితిని. నాదుస్తులను విడచి స్నానమాడి నూతనవస్త్రములదాల్చి యాగదియందున్న నాచిన్న ట్రంకు పెట్టెను దీసికొని వీధిలోని కరుదెంచితిని. అప్పటి కెవ్వరును వీధిని లేరు. తోడనే నేను చరచర గుమ్మమునుదిగి నడువసాగితిని. నిర్మానుష్యమగు నావీధిని యొకింత దూరమేగుసరికి హౌరా పోవుట్రాము వచ్చుచుండెను. ఆట్రాములోనెక్కి స్టేషనున కేగితిని. అప్పటికి సుమారు నైనుగంటలయ్యెను. 5–10 నిముషములకు ఖరగపూరు బయలుదేరు బండిగలదు. ఆబండిలో ఖరగపూరు వెడలిపోవ నెంచితిని. ఇంతలో యాసఫ్‌ఖాను నన్ను గలిసికొనియెను. ఎచ్చటికేగుచుంటివని ప్రశ్నించెను. నేను ఖరగపూరున కేగుచుంటిననియు, నవకాశమున్నయెడల నాడుగాని మరునాడుగాని నన్నచ్చట గలిసికొనవలసినదనియు జెప్పితిని. అతడే నాకు టిక్కట్టును దీసియిచ్చెను.

'అతడాదినమున స్టేషనున కెందులకువచ్చెను' అని గిరిధరుడు ప్రశ్నించెను.

"అతఁడెవ్వరో స్నేహితులను సాగనంపుటకై వచ్చి యుండెనట. నేను ఖరగపూరును సురక్షితముగా చేరుకొంటిని. వాడే యూసఫ్‌ఖానుడు ఖరగపూరులో గలసికొనియెను. ఆతనికి నావృత్తాంతమంతయును దెలిపితిని. ఆతఁడు నన్ను గాపాడుట కంగీకరించెను. పైగా నాతడు, తన కెవ్వరును లేరనియును, నన్నే భార్యగా జూచుకొందుననియును దెల్పి యారాత్రి బండిలో నన్నుదిరుగ కలకత్తా దీసుకొనివచ్చి యీ యింటిలో ప్రవేశపెట్టెను. నాటినుండియు నాతఁడు నాయందనురాగముతోడనే వర్తించుచుండెను. గాని కొన్నిదినము లైనతరువాత నాతఁడొక మందుసీసాను కోటుజేబునందుంచుకొని యిచ్చుటకరుదెంచెను. నేనామందెవ్వరికని ప్రశ్నించితిని. అతఁడు నాభార్యకని యుత్తరువిచ్చెను. అతడీవరకు దనకు భార్యలేదని చెప్పి యిపుడారీతిజెప్పగా నేనెంతయు నాశ్చర్యమును జెంది మరల నాతని నట్లే ప్రశ్నించితిని. అతఁడ య్యది తనభార్యకే యని యుత్తరువొసంగెను. నేను మనంబుననే ఖేదమొంది యప్పటికూరకొంటిని. ఆమరునాఁడాతనితో బ్యాంకిలోనున్న ద్రవ్యమును గూడ దెచ్చిపెట్టు మంటిని. ఆతఁడు ప్యాస్‌బుక్కులో సంతకముజేసి తెమ్మనియెను. పుస్తకముకొఱకు పెట్టె దెరచిచూచితిని. పుస్తకము లేకపోయెను. పుస్తకము లేదంటిని. ఆతఁడీవఱకే నావద్దనుండి దాని దూపాయుచుకొని యుండెను. నాయుద్దేశ్యమేమనగా నాడు

లతో నాతని చెల్ల, ద్రోహమునకై దిగి ఖతిమార ప్రార్థించితిని. అందుచే నిప్పుడిత్తోడనే యాతని కథావశేషునిగా నొనర్చు మార్గము చూచుకొని పోవనెంచితిని. కాని యింతలో ప్రాణసఖులవగు మనుష్యుని యెడ్డదుసు దలంపలేను."

గిరిధరుడు.—నీవు గంగారామునకు వ్రాసిన లేఖలు నియింట నెందులకుండెను?

లీలా.—అతని సామానంతయు నాయింటనే యుండెను. కాని యాతడు చూచివేయలేదు గాబోలును. అందువలన నాతని పెట్టెలో మీ రాక ఋజువు లభించియుండవచ్చును.

మరల నామె యూపిరాడమికి లోనయ్యెను. డాక్టరు మందోసంగెను. కొన్ని నిమిషములు నిశ్శబ్దముగా నుండెను. లీలాకుమారి సనకాయాస మధికముగా నున్నదనియును బాధ దుర్భరముగా నున్నదనియును, వక్షమున గ్రుచ్చుకొనియున్న బాకును దీసివేయవలసినదనియు ప్రార్థించెను. మరణవాఙ్మూలము పై నామెచే వ్రాలుచేయించి యచ్చటికరుదెంచిన గ్రామస్థులచే సాక్షివ్రాళ్ళు చేయించి గిరిధరుడు డాక్టరు బాబుతో యామె వక్షమున గ్రుచ్చబడిన బాకును తీసివేయవలెనని నుడివెను. డాక్టరు బాబు బాకునూడదీసెను. మరు క్షణముననే లీలాకుమారి ప్రాణవాయువు లనంత వాయువులలో గలసిపోయెను.

అంతట గిరిధరుడు—ఆహా! ఒకకాంతామణి కొఱకై జరిగినవి అయిదుహత్యలా. గర్భనిర్భేదకముగా నున్న దేయని బల్కి నిశాశేషమంతయును వేగించి తెల్లవారినతోడనే యీ సంగతినంతయు పైయధికారుల కెఱింగించి యాశవములను జనరలు హాస్పిటలుకు పంపించెను.

---

## పదియవ ప్రకరణము.

---

సమాప్తము

ఏవసితాసనసమూలమున మనోహరసేనుడు, గంగా రాము భవానీసింగులు, రామనాధచటర్జీ, యూసఫ్‌ఖాను మర ణించియుండిరో యారమణీమణి యాత్మహత్య గావించుకొని మరణించినది. ఎచ్చటినుండి రక్తవాహిని ప్రవహింప మొద లిడెనో యాస్థలము సమూలముగా ధ్వంసముచేయబడినది. పత్రికలన్నియు లీలాకుమారియొక్క సంపూర్ణచారిత్రమును ప్రకటించినవి. జనులందఱును, "ఇంతటిసాహసముగల తరుణీ మణిని మున్నెన్నడును గాంచియుండలే"దని ఆమెను గూర్చి ప్రశంసావాక్యముల బలుకసాగిరి—పలువురు గిరిధరుని బుద్ధి విశేషమును గూర్చి యధికముగా పొగడసాగిరి. కేశవలాలు గూడ గిరిధరుని బుద్ధివిశేషమునకు మనంబున సంతసించుచుగా

సంతసించి యాతనివలన దనసంశయమును వాపుకొననెంచి యాతనిం గలసికొనియెను.

గిరిధరుఁడు కేశవలాలును గాంచినంతనే దయచేయుఁడని యొక యాసనముపై గూర్చుండనియమించి "ఏమివిశేషములు, ఇంక నేడు హాయిగా నెట్టిచింతయును లేక నిద్రపోవచ్చును గదా'' యని బల్కెను. కేశవలాలు దరహాసాంచితవదనుఁడై- "అగునగును కాని మహాశయా! నాకొక్క సందియముగలదు. తమరు యాసఫ్ఖాను నెందుల కనుమానించితి'రని ప్రశ్నించెను. గిరిధరుఁ డిట్లు చెప్పసాగెను. "నేను బ్యాంకికిపోయి ఎల్లరచేతను సంతకములను జేయించి ద్రవ్య మొసంగువాఁడాతడగుటచే నాతనిగలసికొని మాట్లాడిన నామె యాచోకీ దెలియునని తలంచి యట్లొనర్చితిని. కాని యాతఁడు నాకు సరిగా సమాధానమిచ్చియుండలేదు. ఆకారణముచే నాతని ననుమానించితిని. నాటిసాయంకాల మాతనికొరకై యాఫీసున కేగితిని. కాని యాతఁ డచ్చటలేడు. అతని నివాసమును దెలిసికొని యచ్చటి కేగితిని. అతని నచ్చటినుండి వెంబడించి యాతఁడేయింట జొచ్చెనో జూచితిని. ఏసహాయమక్కర లేకుండ లోనికేగుటకు వీలుగలుగునేమోయని చూచితిని గాని యవకాశమున్నట్లు గాన్పింపలేదు. అపుడు మీకై వార్తబంపితిని. పైగా మనమానాటిరాత్రి యాయింటివెనుకనున్న యాతనితో మాటలాడియుంటిమి. అతఁడు చెప్పిన వాక్యములు నాయనుమాన

“నీ కేమి యీనాఁ డొకనాఁడు గంగారాముగారొక్క వివా
హము క్షేత్రపూరుని చెప్పి [illegible] ని గలసికొని మాట [illegible] సిన
దని చెప్పియుంటిరి జ్ఞప్తి యున్నదా?”

“అవును.”

“ఆనాఁడాతనిని గలసికొంటిని.”

“ఆతఁ డేమని చెప్పెను?”

“ఆతనికిని గంగారామునకును ముఖపరిచయము గల
దట. గంగారాము సర్వసాధారణముగా లీలాకుమారితోఁ గలసి
క్షేత్రపూరువద్దనుండి బొటానికల్ గార్డెన్సునకు వాహ్యాళికై
వచ్చుచుండువాఁడట. అందే యాతని పరిచయ మాతనికి
గలిగెనట.”

“క్షేత్రపూరు వివాహమును గంగారామునితోఁ జెప్పి
యుండెనా?”

“లేదు. తరుచుగా వచ్చుటకే వచ్చుచున్నాఁడని [illegible]
దలఁచుకొనియుండెనట అందుచే నాతఁ డిల్లు కొనియుండెనట.”

“అక్కడనే లీలాకుమారికి భవానీసింగునకు స్నేహము
లభించియుండవచ్చును.”

“నేనును నట్లే తలంచుచున్నాను.”

ఇట్లు మాటలాడుకొనిన యనంతరము మరునాఁడు
న్యాయస్థానమున దాము వెల్లడింపవలసిన యంశములను
గూర్చి చాలవఱకు మాటలాడుకొనిరి.

మరునాఁడు న్యాయస్థానమున నామెచరిత్రము తయును ప్రకటింపబడెను. న్యాయాధికారి గిరిధరుఁడు తనయభీష్టము ననుసరించి ప్రభుత్వమువారొసంగిన గడవులోననే యాలీలా కుమారిని బట్టుకొనినందుల కెక్కుడుగా నాతని నగ్గించెను. తదుపరి యాతఁడు గిరిధరలాలున కిట్లనియెను. "ఎందరెందరో పత్తేదారులు నోట్లసృష్టినిగూర్చి పనిచేయుచున్నారు. కాని వారెవ్వరును యింతవఱకు కృతకృత్యులు కాలేదు తామిందు ప్రవేశించి యాద్రోహులనుగూడ దమ నూత్మబుద్ధితోఁ గని పెట్టి పట్టుకొనవలయును." అనిబల్కి న్యాయాధికారి యాసనమునుండి లేచి యలహాబాదునుండి పోలీసువారుపంపిన రిపోర్టు నిట్లు చదివెను. "లీలాకుమారి ఈమె యొక భోగంపుచానచే పెంపబడియెను. పదునారవయేట నీమెకు రామానందచటర్జీ గారి ప్రాపకము లభించెను. వారిప్రాపకమున నీమె మూఁడు సంవత్సరము లుండెను. వారిప్రాపకములో నున్నను యీమె యిరువురు తగుమనుజులను దనవంక కాకర్షించుకొని ధనసంపాదన మాచరించుచుండెడిది. వారిలో గంగారా మొకఁడు. గంగారా మీమెకై దనసర్వస్వమును వెచ్చించెననియే చెప్పవలయును. కట్టకడపట నీతఁడు తనకున్న మాన్యమును నాలుగువేలరూపాయలకు విక్రయించుకొని లీలాకుమారి నింటినుండి లేవదీసికొనిపోయెను. లీలాకుమారి మంచిజాణ, విద్యావతి. ఎట్టివారలనైనను యిట్టె దనవంక కాకర్షించుకొను

